

శ్రీ. శ్రీ. ధర్మవరపు
వెంకట సుబ్బయ్యగారు,
కారంచేడు.

ధర్మవరపు వంశంబు సుధాపయోధి
అందు వెంకటసుబ్బయ్య కమృతరుచికిఁ
గలిగె సీతారామాంజనేయులు బుధుండు
రమ్యవాఙ్మయధిషణాధురంధరుండు.

మతిదివిషద్గురుఁ నను సమాహితచిత్తు ననంతకల్పనా
చతురుని దేశభక్తిగుణసాంద్రుని నిత్యసరస్వతీకు న
ర్చితునిగఁ దండ్రి కంకితము చేయనుగోరుచు 'ఝాన్సిరాణి' నీ
కృతి వరియించెఁ దజ్జనితకీర్తి స్వరుత్తమభోగకారి కా.

తదభ్యుదయపరంపరాభివృద్ధిగా.

# ఋహా స్ప్రీ రాజి

## ప్రథమాశ్వాసము

౧

విశ్వాధారము కాల మేసమయ మావిర్భూతమౌఁ దత్కళా
శశ్వల్లక్షణ మావహిల్లు ఘటనాసర్వస్వమం దంబుజా
తశ్వేతంబులకున్ మొయిళ్లకు వియన్మధ్యస్థలీయాత్రలో
నాశ్వాపాతము పండువెన్నెల ప్రభాహారిచ్ఛటల్ తెచ్చెడున్
శుష్కసితమేఘముల కబ్బుఁ బుష్కలత్వ
మమృతసస్యపరిప్రభుత్వాతిశయము
నవ్యసస్యేందిరానిదానంబులైన
వర్షవర్షి మేఘంబు లధఃకరించి.
రవికిరణాగ్రసంక్రమణరాజితరాజసుధాంశుకల్పితో
త్సవమగు సస్యశోభకును సన్నని యుల్లి మొయిళ్ళయొక్క హే
తువు వచియింతు రజ్ఞలు విదూరజకాంతిశలాకవోవి కం
కె నవలు పైరుకజ్జతులకింపుల కుల్లి మొగిళ్ళు హేతువా?
లోచ్చున్ వెల్గులకూటముల్ దెలిమొయిళ్ళుం గాలచిహ్నంబు కా
నచ్చున్ వానికి లేనిపోనివి ప్రభావంబుల్ ఘటింపంగఁ దా
ముచ్చుల్ పన్నుచు దిక్కులందునను వాయుప్రోద్ధతంబుల్ ఘనా
నచ్ఛిండంబులు ఝుంఝులం గదిపి తీవ్రంబై విడంబించెనున్.
ఎవఁడో యభిజ్ఞః డీతెలిమొయిళ్ళగు పిప్పికి నింత మోహమున్
దవులుట యేల నాఁగఁ గుపితంబగు శారదికావదాతభా
వనము మోహపడ్డ జనభావము, వానికి నేమి యింక? సం
భవనము మోహసంజనితభావమె తద్గతకాలచిహ్నమై.
ఇంతకు వాని నన్న పని యేమి? విచిత్రపుఁ గాలభావవి
భ్రాంతి కనేకచిహ్నములుగా నిది శారదకాలచిహ్నమై
శాంతము శ్వేతమేఘతతి శారదికం బగుపించి యింతలో
నెంతయు వృద్ధి పొంది వహియించు హిమంబును గ్రీష్మతాపమున్.

సతతవినీలమేఘపరిషత్తులు మిన్నులఁ గొల్వు దీర్చి సం
గతమధుదానధారల జగంబును దన్పఁగ ధర్మరాజులై
కృతకము లీమొగిళ్ళగమి కింసఖముల్ చని శ్రేష్ఠు లట్లు యా
చితముగ వెన్క వెన్కఁ బడి జీవనముల్ నిలఁబెట్టుకొన్నవై.

వీనికిఁ గొమ్ములు వచ్చిన
వీనాఁటికిఁ గాలమహిమ యే మని చెప్పన్
దానవమగు వ్యామోహ
స్థానమ్మున కెంతయైన దశ పట్టుఁగదా!

తొలిమేఘంబులు ధర్మరాజులయి వారుల్ దానముల్ సేయఁగాఁ
దెలి యీపల్చనిదూదిపింజలు వియద్వీధిమృగేంద్రాసనం
బులఁ గూర్చున్నటు లుండి క్షేత్రినివహంబుల్ బంకముం జేసి యెం
డల కెండించి పగుళ్ళు సూపెడు సమానత్వంబుగాఁ జూపుచున్.

వ్యవసాయంబును జేయు కర్షకులు నీలాంభోదముల్ సూడ ని
ర్వ్యవసాయుల్ పటుభోగిజాతి యవదాతాస్యంబులం జూతు ర
య్యునలో భోగికులానికిం దెలిమొయి ళ్ళుద్యోగముంగాని యు
త్పన ముద్యోగము చేసి [illegible] గిలిగింతల్ పెట్టి నవ్వించుచున్.

ఇవి గాలి కెగురు దుమ్ములు
కవిసిన మబ్బులవిధానఁ గన్పడు వానన్
దవిలిన మోహమె మోహము
నవనాగరకత్వహృదయనాళీకమ్మై.

వెలుఁగనాదినుండి విజ్ఞానమునకును
నోలిఁ దెలుపు సాధుశీలమునకు
నకట! లక్షకంబులై యుంటఁ దెలిమబ్బు
గముల దొంగవర్తనంబు సాఁగె.

ఒక యసాధువేళాభవ ముగ్రికర్మ
వితతి కొనసాఁగు మండు నిర్విఘ్నముగను
అచట భ్రాంతి వహింపఁగా నజ్ఞ లద్ది
కాలగతధర్మభావలక్షణ మటంచు.

ప్రథమాశ్వాసము

అవి విఘ్నంబులు లేక సాఁగినఁ బ్రవాహత్వంబు భాసించు నా
యది యేమైనఁ బ్రవాహధర్మ మగుఁగాని! సర్వధర్మంబు తా
నదియై తా నది నిత్యధర్మమునునైన నెంచు టన్నన్ బ్రవా
హదశైక్యమ్మును బొందినట్లు పరమార్థాభిజ్ఞతల్ మాలుచున్.

పరఁగఁ దదేకదేశపు స్వభావవిచారణ చేసి మూలమై
పరఁగు మహాపదార్థపు స్వభావము నుత్తము లేర్పరించుకొం
దురు మఱి మధ్యముల్ గురునితోఁ దొలివస్తువు నెచ్చి యేర్పరిం
తురు కలితైకదేశమగు తొల్తటిదాని స్వభావ మచ్చటన్.

అక్కట! యేకదేశమునయందలి మోహము సర్వవిద్యయై
యక్కట! మూలవస్తుపరమార్థ మెఱుంగఁగ లేకపోయెడిన్
నిక్కము చెప్పినన్ వినమి నేర్చుటయే యవిచారలక్షణం
బిక్కువలేని కోపము వహించిన నాపయిఁ జెప్పనేటికిన్.

కాలస్వభావవేత్తలు
హేలాపరమేశ్వరులు మహీరక్షకధ
ర్మాలిప్రశ్నేముషీకులు
ఫీంగోపము తీర్పఁగా యతించిరి పరముల్.

ఆత్మ నిత్యమైన యాత్మ సర్వజ్ఞంబు
నైన యట్టి వస్తువైనయెడల
సృష్టి మొదటి వికృతి చిన్నము పీసము
మఱియు నద్ది వికృతిమాత్రవికృతి.

క్రమముగ వృద్ధిపొందిన వికార మధర్మపురూపమై చనన్
నమితచతుర్దశాకపరిణామము పొందును ధర్మరూపకా
లము కృతత్రేతలున్ సమబలం బగు ద్వాపర మంత శక్తిహీ
నము కలి పోను బోను నమనంబును పొందినయట్టి ధర్మమై.

ఈనాల్గు వేళలును దా
మైనన్ బెఱమూఁటియంశ లవి గొని చను లో
లోన మఱియు మఱి నంశల
లో నంశలు గాఁగ నిట్టులుగఁ గాలమహ్మా.

ఏ వేళ గడచునప్పుడు
నా వేళాలక్షణంబు లధికము పెఱు మూఁ
డౌ వేళల గుణములు సూ
క్ష్మావిర్భూతములు గాఁగ నది చక్రమ్మై.

తుదికాలంబుననైనను
మొదలింటి కాలంబు నంశములు ఘటియిల్లున్
తుదిఁ గలిగుణములకే యొ
ప్పిదముగ నధికతయు సంభవించునుగాని.

స్మృతిభయము లేదు ధర్మాని కితరమునకు
స్మృతిభయముతక్క వేఱు లే దెంత యైన
సాహసము చేయు ధర్మంబు సమయ మొకఁడు
తన కననుకూల మాటచేఁ దగ్గుఁగాని.

కలిలక్షణముదె చివరకు
గెలుపైనను గుణము కృతయుగీనము జ్వాలా
వలిచుంబితగాఢవియ
త్తలమైన యుషర్బుధపరిధాకము వోల్చున్.

సృగ్ధర :
కృత్తారిశ్రేణికంఠక్షిపదసృగుదితక్లిష్టధారాప్రవాహో
ద్వృత్తాగ్రమాంసప్రణీతోద్ధతవిధురితసంధ్యాచ్ఛవిప్రౌఢరేఖా
సత్తాకంబై దిగంతస్నపితనిజయశస్సాంద్రచాంద్రీఝరీసం
సత్తివ్యా[illegible]భవ్యత్సకలసురజనాశాప్రమాణంబు వోల్చున్.

---

౨

జిగురుల కెండెలున్ వలలు చేరిచి దారులు మూయఁ [illegible]
దుగ నెలగోలుగాఁ బరవ దోలి కిరాతులమూఁక కానసం
బగడుగ రాజసింహనివహంబుఁ బరాభవవహ్నిఁ గాంచ నా
యుగగురువైన యాడుపులి యొక్కఁడు చీలిచిపెట్టె వాగురల్.

బహుముఖంబులుగా విజృంభణము సాగఁ
గలికిఁ గైలాసనాథునికలికి కోప
మండితానన పతితోడ మత్సరించి
కలివిజృంభణమును నరికట్టఁ దలఁచి.

తనవాహనమైన మృగేం
ద్రుని భారతదేశమున వినూతనమూర్తిం
జనియింపు మన మృగేంద్రము
కనుగొనల నిప్పు లురలఁగా జనియించెన్.

పులిస్వభావంబు ప్రకృతిలోఁ బొందుపఱచి
తాను స్త్రీగాఁగ జనియించెఁ దల్లి యంద
గౌరవంబు నెఱపఁ జిర్నగవుపిసాళి
కాలకంఠుని మొగమునఁ గందళింప.

పులి ముంగాళ్లలఁ గూరుచుండి యిలపైఁ బుచ్ఛంబు తాడించుచున్
గలితానేకమహాగ్నిగర్భములుగాఁ గన్నుల్ ప్రసారించినన్
గలిరూపంబు కిరాతజాతి యెదలం గంపించుచున్ నేలయం
చులు మూచూచుచుఁ దోకల్ ముడుచుకొంచుం బారి రొక్కుమ్మడిన్

చలిమలకూఁతునాజ్ఞ మెయి సంభవమందిన వ్యాఘ్రి దేవతా
వలి తెలివొల్ల విప్పుకొను భావమునందున నూహసేసెఁ బు
వ్వులు తు[illegible]కొను తండ్రినగవుల్ జిగికెంపుల జీగపాలు ని
మ్ముల[illegible]ను [illegible]మముల్ స్వజన్మగృహాన్న ను[illegible]న్.

పొలపడి య[illegible]పుష్పలపోలిక వ్రాలినట్టి తా
వుల నఖిలంబు భగ్గు మని పుట్టినమంటలుగాఁగనై కిరా
తులగమి నాల్గుదిక్కులను దోలిన కుక్కలఁ జెల్ల చేఁగఁగాఁ
బులి తనగొంతులోపలను బూంచిన గుర్రుగఁ జూచె నుగ్రమై.

క్రూరకిరాతజాతి యనుఁగుంబసికందుల మ్రింగి కానన
త్స్మారమణీమణీకితవసంగమవాంఛను సిగ్గు చూపఁగా
నూరిన కంటికెంపులను నుగ్రమనోహరమూర్తి వ్యాఘ్రి చ
తూరమమూఁభావగతనుష్కముగా మది నెంచె నీగతిన్.

ఈజాతి చిత్రమైనది
గాఁ జరలున్ లతలు తినినఁగాని బ్రదుకం
గాఁజనుఁ బెజజాతుల పాఱి
ణాజిరదేశములఁ బాములై మను టేలో!

ఒకగింజనుఁ బదిగింజలు
నికరంబుగ రాల్చుఁ దల్లినేల కటా! జీ
వికఁ గడచుదానికై యీ
పరికటాఘము లాచరింతురి పాలసులు ధరన్.

గాలికిఁ బుట్టిన దోమల
పోలిక నెచ్చోటనుండి పుట్టిరో! తెలియం
గాలేము నాగరకతా
హేలాగానంబు చెవుల నేచెదరు బళీ!

ఒక జేనెడుపొట్టకు నీ
రకటా! పాపంబు సేతు రాకాశపరిమా
ణకముగ మఱి పాతాళము
నకు నడుగున నెన్నియోజనా లోవ్వుదురో.

మన్ను పిసికి సాధుమానవుల్ బ్రదుకఁగా
మన్ను తింద్రు దుష్టమానవాళి
మన్ను పేరు చెప్పి మాంసమ్ము తిన దది
యసురజాతి యింతకంటె నయము.

ఇంటికన్నను గుడి భద్ర మీకుటిలపు
జాతి కాగుడి గ్రుడ్డివి సగము మించి
గ్రుడ్డిదైనట్టి లోకానఁ గూరుచుండి
తాఁ బరితారించుచుండె నధర్మకులము.

స్నానము సంధ్య లేనిదియు శౌచము ధర్మము లేనియట్టిదిన్
దీనిని జిత్రమై యనుమతించెను శ్రీశివమూర్తి తల్లి కో
పానికి లెక్క సేయక కృపానిధి కాలవిలీనమూర్తి య
జ్ఞానముచేత డీల్పడిన జ్ఞానముగా వెలయింపఁజేయుచున్.

# ప్రథమాశ్వాసము

బహుఖండంబులఁ గాననావళి మహాపంచాస్యసంహారస
న్నహనం బేసిన జాతి చంద్రికలానాదంబుగా మౌళిపై
విహరింపంగను జేయు శ్రీశివకృపావిఖ్యాతి మహార్ఘ్యం బహో!
దహాయించున్ బహుదేవతాహృదయసంధ్యాచంద్రికానల్లరిన్.

ఏని దుష్టు నిల్లు వెడలించె జనకుండు
వాఁడు పోయి యూళ్ళపైనఁ బడియెఁ
దొలుత వాఁడు దోపిడికాఁడయి
కడను వచ్చి రాజుగాఁగఁ దేలె

జనకుఁడు దొంగయౌ సుతుని శక్తివశంబునఁ జక్రవర్తియై
తనయుని చోరలక్షణపథం బగి గిట్టుటచేత లోకపా
లనమును చోరలక్షణబలంబునఁ జేయుఁ ద్రిశూలి దా తృప్తి
యనయనభాక్స్ఫుఖావితతి యారిపదో యను వేళ యందయై.

కాలము మారిపోయినదికావలె శౌర్యము శక్తి సింహశా
ర్దూలనఖాగ్రదంష్ట్రికలరుంతుదముల్ పనిచేయలేక పోఁ
గాలపువాఁగురల్ జిగురుకండె లచేతనముల్ పొనర్చఁగ
గ్రోలుగ బెండులున్ మునిఁగి గుండులు తేలెడునట్టి కాలమై.

మైతెలుపు శౌచ మయ్యెన్
జేతోవక్రత విచారశీలత యయ్యెన్
గోతులు త్రవ్వుట నరపతి
నీతియుఁ గాల మ్మిదెంత నెగడుఁ గృతకమై.

తిండి కటంచు లేక పరదేశములం బడి పీట వెట్టి కూ
ర్చుండి యొకింత వైద్య మని యొక్కఁసుమంత మతం బటంచు నా
యుండిన నేల చీకటియు నూర్జితమూర్తులు నావ క్రొత్త మా
ర్తాండులు గాఁగఁ దుట్టుతుదదాఁకఁ బ్రతారణభావమూర్తులై.

అందఱు కట్టుగుడ్డయును నన్నము కల్గిన నేలఁ జొచ్చి యీ
మందులు శాస్త్రి సర్వులు సమానులటంచును మోసగించి త్తా
మొంది ధరిత్రిరాజ్య మెదు రొడ్డినవారిని హింస చేయఁగాఁ
గందురు వారిమాటలను గల్లను జూడఁగ నేర రల్పులున్.

ఒక్క మందబుద్ధి యుండును జగతిలో
నతని భాగ్యమెల్ల నపహరించి
మోసగాఁడు సౌధములు గట్టుఁ దత్సౌఖ్య
భోగములకు వాఁడు పొంగిపోవు.

ఎన్ని మోసగించు తెన్నులు కలవో యా
సర్వమందు వీఁడు సార్వభౌముఁ
డతనిగీత మంచి దజ్ఞానమునకుఁ బ
ట్టాభిషేకవేళ యరుగుదెంచె.

అని గర్జించిన పెద్దయాఁడుపులి సింహాభీలదివ్యస్వనం
బున దిక్కందరగహ్వరోళివియదాభోగంబు ఘోషింపఁగా
వినమత్రూక్కరకిరాతజాతియెడఁదల్ ప్రీలెన్ బునశ్శాంతని
స్వనమై ధైర్యము పూనె వెల్గాదిగిపోవన్ రేగు చీఁకట్లుఁగా.

---

# ఝాన్సీ రాణి

## ద్వితీయాశ్వాసము

౧

అపులి యెంధుఁ బుట్టు టనునట్టి విచారణ హైమశైలక
న్యాపదనీరజాతములయందునఁ జూపు నిగుడ్చెఁ డల్లి యుం
డోపక హా సనీరజములోఁ దల రాచుకొనంగ నంగుళి
వ్యాపృతపాదువాళ్ళిరమై స్పృశియించెను వేఁడ్కఁగనఁగయున్.

పతికారిన్యము గంగకైన రుచియింపం బోదటం చద్ఘమై
ధృతిమై వాహనముల్ భగీరథసుతాతీరమ్మునన్ జన్మసం
గతి గాంచన్ వచియించె నద్రిసుత గంగాతీరమందుం బురా
వృతమై యెన్నియొ దేవతాంశములు జన్మించెన్ స్వతంత్రద్యుతుల్.

ద్వితీయాశ్వాసము

పరమశివమూర్తి నఖశిఖాస్పృశ్యముగను
నెచట మన్నించె జాహ్నవి నచట వార
ణాసి వసియించె నొక బ్రాహ్మణప్రభుండు
"నప్ప"యాఖ్యుఁడు "పీష్వా" కులాంబుధిశశి.

ఆ "పీష్వాకులు" నాశ్రయించి మను శౌర్యాంభోధి యొక్కండు మో
రోపంతాఖ్యుఁడు విప్రయోద్ధ ధిషణాఢ్యాత్ముండు ఫాలాక్షుత
త్స్వపాదాంబుజభావనాత్తభుజపాండిత్యుండు మాతృక్షితి
వ్యాపన్నస్థితి గుండెలో వెలుఁగుదీపంబై ప్రతారించఁగా.

ఆరుచిరస్వతంత్రమతి కంగన చెంగున దూఁకు లేడికన్
జీరలు కన్నుదల్ వెలుఁగుచిమ్ములఁ గూర్చిన చానపేరు భా
గీరథి యాత్మలన్ గృతయుగీనులు వారల గర్భవీచికా
పూరమునందు లక్ష్మియయి పుట్టెను పార్వతివాహనం బాగిన్.

ధృతి నీభారతదేశసంగతపరాధీనత్వనిర్మూలనో
ద్ధతబాహాపరిదీప్తమా పురుషసంతానంబు వాంఛింపఁగా
సుత జన్మించెనటంచు ఖిన్నపడుచో క్షోణీసురుం డాయుధా
యతనంబందునఁ గత్తిడాళ్ళరసి తీవ్రారావ మేపారినన్.

మ్రోగిన భేరికానినదముల్ ఘటియిల్లెను నంత నప్పపీ
ష్వాగృహమందుఁ బంజరనిబద్ధము వ్యాఘ్రమొకండు చండగ
ర్జాగురురావమై యెసఁగ సంతసమందెను విప్రయోద్ధ త
స్వాగురుతేజ మాశిశువు ప్రీతమహేశ్వరిమూర్తి కావలెన్.

అన్నప్రాశనవేళ లక్ష్మి యట రత్నానేకముల్ తాళసం
పన్నంబుల్ బహుగ్రంథముల్ వదలి యాపై నున్న ఖడ్గంబు గై
కొన్నన్ భూసురయోధుఁ డీశిశువు నాకుం గీర్తి తెచ్చున్ ధరా
సన్నాపత్తతి చీల్చు నంచుఁ దలఁచెన్ సంతోషరేఖాస్యుఁడై.

పిల్లకు ఖడ్గవిద్య కఱపింపఁగ నచ్చట వారణాసిలో
వల్లయు కాక యేవెసులుబాటును లేక ఫరంగి గుండియల్
జల్లన వచ్చుటన్ గరిడిశాలలు నిల్వఁగనీయకున్కిఁ దా
నుల్లమునం దుపాయముల నూహ పొనర్చుచునుండెఁ దండ్రియున్.

శ్రీసర్వంబు ఫరంగిజాతి కొన "బాజీరావు పీష్వా" భృతి
గ్రాసుండై పరిశిష్టభోగములతో గంగాస్రవంతీతట
వ్యాసక్తంబయి పొల్బు పట్టణము బ్రహ్మావర్తముఁ ఖ్యాతిల
క్ష్మీసంసక్తగుణాళితో నధివసించెన్ శిష్టతేజస్కుఁడై.

మరి యాతండ్రియు నంత కూఁతు గొని బ్రహ్మావర్త మేఁగెన్ ధరా
వరు నాస్థాన మదెల్ల లక్ష్మిచురుకున్ బ్రాభాతనీరేరుహో
దరభాగాననహాసవల్లి సముదాత్తప్రోజ్జ్వలద్భావబం
ధురముల్ మెచ్చెను ముద్దుబిడ్డయి సభాభావంబు పాలించుచున్.

భాసురమూర్తి యొక్కరుఁడు బాలకుఁ డచ్చట లక్ష్మితోడ సా
వాసము కట్టె నిద్దఱును బట్టిన కత్తిని దింపకుండ న
భ్యాసము చేయుచున్ గడప నాతఁడు కొంచెము పెద్దవాఁడు చం
డాసి కళావిశారదుఁడు నన్నయుఁ జెల్లెలుగా మెలంగుచున్.

"నానాసాహెం" బతండు శ్రీపతివలెన్ నాళీకపత్త్రేక్షుఁడున్
సూనాస్త్రున్బలె సర్వమోహనకళాసూత్రాంతరంగుండు న
క్షీణోత్సాహుఁడు వానియందునను బాజీరావుపీష్వా ప్రియం
బూనున్ వీఁడె యనంతరుం డగునటం చుర్వీజనుల్ చెప్పికోన్.

అతనితండ్రి మాధవరా వటన్న జోదు
నతనితల్లి "గంగాబాయి" యాయిరువురు
రెండుదెసలఁ బీష్వాలతో నుండు ప్రాంత
దైన బంధుత్వ మొప్పుకున్నట్టివారు.

పులులై పూర్వము నేఁడు మేకలవలెన్ పూనాసతారాలలో
పల జీవించనులేక తేనితనమో పాడో "మహారాష్ట్ర" వీ
రుల కీతం డొకఁ డాశ్రయం బని భుజారూఢంబు ఖడ్గంబుతో
శిలలై చేతములందు వచ్చి రిట "బాజీరావు"తో వారలున్.

కౌమరుం జూచిన ధాత్రిపాలనకళాకూలంకషంబైన క
న్బములున్ శత్రుచమూసమూహధనవాంభోరాశిగాంభీర్యవి
భ్రమముల్ కన్నులు నాశలన్నియుఁ గుమారన్యస్తముల్ గాఁగ న
కౌమారుం గైకొని బాజిరావు బడిదిక్కుంగాఁగ నేతెంచిరిన్.

క్షోణికిఁ గ్రొత్తపాప మిది చుట్టుకొనెన్ దెలిపాచిగా గత
ప్రాణము ధర్మముం జెదలుపట్టెను నాలుఁగుకాళ్ళు వచ్చె న
క్షీణపు యాత్రగాఁ గలికిఁ గీలొక్కఁ డాడిన పచ్చిబొమ్మలున్
గోణము కట్టినచ్చి తోలికూటములం గదలించు వీరుతై.

తనకుం బోయెడి దేమి దొంగకు సముద్యత్సాహసం బెంత యై
నను చూపున్ మఱి యిల్లు కట్టుకొని యున్నాఁడే గృహస్థాతఁ డెం
దును భార్యాసుతు లేమి యాదురో! ధనాదుల్ పోవునో యంచు భీ
తిని వర్తించును దొంగ ధీరుఁ డని నర్తింత్రల్పధీకుల్ ధరన్.

నిజముగ దైత్యులవలనన్
ప్రజకుఁ గలుగు కష్ట మెంతపాటిది యెవఁడో
నిజధర్మము వీడి పర
ప్రజ చేరెడువాఁడు తెచ్చు పాటులలోనన్.

శత్రు వెపుడు మనకుఁ జాలఁడు నిజముగా
వానియంత వాఁడు వచ్చి గెలువ
నుఱియు నల్పబుద్ధి మనవాఁడు వానితోఁ
జేర వానిబలము మీఱిపోవు.

శత్రుజనునివలనఁ జావ దెప్పుడుగాని
యొక్క-జాతిధర్మ ముర్వియందు
మనుజపశు వొకండు తనధర్మము త్యజించి
శత్రుఁ జేరినపుడు చచ్చినట్లు.

తనదేశము తనధర్మము
తనవిద్యయు వదలి యెవఁడు తాఁ జేరుఁ బరా
వని విద్యాధర్మము లా
జనుఁ డొక్కఁడు చచ్చు రెండుచావులు ధరణిన్.

ఒకఁ డధికవివేకివలెన్
బ్రకటితముగ నభినయించి పరభాషాధ
ర్మకృతకనాగరకతఁ గొని
ప్రకృతి సమస్తంబు కలుషపఱచుకపోవున్.

ఎవనికిఁ దక్కువై ఖరి సహించును? ధారుణి స్వాభిమాన మే
చు విషయమందుఁ దక్కువను జూపిన యట్లు తలంచుఁగాని తా
నెవఁడు స్వధర్మమున్ వదలి హీనము తక్కువదంబు పోవు నా
యవినయబుద్ధిచే స్వమతహాని ఘటిల్లు స్వదేశనష్టమై.

లక్ష్మి యిట్లు తండ్రిలలితోపదేశంబు
పొంది ఖడ్గనీతులందు నెగడె
తాను జనకనీతి "నానాసాహెబు" గడి
తేరి లక్ష్మి నీతిఁ దేర్చసాఁగె.

---

౨

నా చేతిలోని కత్తిని
ఏచినవా రింతవఱకు వెలయరు చెల్లీ!
నీచేతి కత్తిచదురులు
నా చెప్పినవిద్య మించినావే గురువున్.

అనియెను "నానాసాహెబు"
విని మోరోపంతు కనుల విరిసిన మోదం
బున లక్ష్మిశిరసునందున
నునిచిన హస్తంబుతోడ నూహించె మదిన్.

"నానాసాహెబు" చక్రవర్తియయి యీనాతల్లి యేరాజ్యమం
దైనన్ సర్వప్రభుత్వముం గొని స్వధర్మాభీష్టగతిన్ విధా
నానూనస్థితి గాంతురో కుటిలులౌ నాంగ్లేయరాజ్యాగమా
ర్గానం గత్తులగోడ కట్టుదురో యీకాలుష్యముం ద్రోచుచున్.

ప్రతిదినపరాభవంబుగఁ
బ్రతికెదరు జనంబు నేఁడు భారతధాత్రిన్
సుతి మించి రాగమునఁ బడె
వితతఫరంగీల జాతివిధ మెన్నినచో.

నిన్నటిదాఁక నర్తకులు నేఁటికి ధారుణి నీతివేత్తలున్
నిన్నటిదాఁక యాచకులు నేఁటికి రాజ్యరమాధురంధరుల్
కన్నులు నెత్తికెక్కినవి కావర మేమనవచ్చు గౌరవం
బన్నది నేరఁబోవ రకటా! యిట భారతజాతియందునన్.

దొంగలగుంపు వచ్చినది దోపిడిచేసెడు లేకు వెన్కయున్
ముంగలఁ బల్కినన్ బొగరుబోతుతనం బదియెంత? మిన్నులున్
నంగినచోటినుండి దిగివచ్చిరి కృత్రిమనీతి ధర్మ మ
ఱ్యాం గుటిలుల్ మహాత్ములయి రీకలి యేఁబదివేలనాఁటికిన్.

కొందఱిబుద్ధికిం దరుముకొన్న నుదాత్తపుభావ మొక్క దా
యందఱితోడ నల్పముల నాడి యదే పరమార్థ మంచు నా
యందఱ మోసగించి పెఱలందున మోసము చెప్పి యల్పబు
ద్ధిం దమియించు నీకితవధీకులు జాడ్యమువోలెఁ బట్టిరే.

కడుఁగాని బుద్ధిపూర్వకముగాఁగ దుపాకిని గాల్చి చంపు నె
వ్వాఁడయిన న్యాయమన్నఁ బొరపాటని చెప్పును జాతివాఁడు నొ
క్కఁడు మరణించినన్ బదులుగా నొక వందయుఁగాఁగ భారతీ
యుఁడుహరియింపఁగాఁబడు నహో! దయమాలినవేళ యెట్టిదో?

ఎంత పాపము చేసియు మృతిని గాంచు
వేళ మతగురువుం బిల్చి విప్పి చెప్ప
నంతతో సర్వపాపంబు లంతరించు
నట్టివానికిఁ బాపభయం బిఁ కేల?

ఆదేశంబున నెందుకుం బనికిరా రన్నట్టి యోగ్యత్వమ
ర్యాదాహీనుల నెల్లఁ బోనడవఁగా నాహూఁక సార్థంబుగా
నీదేశంబున కేగుదెంచి కరుణాహేవాకులౌ వీరిమ
ర్యాదంబొంది తుదన్ సమస్తహరణవ్యాపారముం జేయుచున్.

ఒకని సాయ మంది యొకమేలు పొంది యా
కడకు వానిగొంతు కత్తిరించి
సరగ రాజ్య మేమి సంపాదనము చేయు
చున్నవారు నేలుచున్నవారు.

ఈకాలఖండ మెట్టిదో
యీకృతులను ధర్మములుగనే భరియించుచున్
చేకొని యీదృక్కృతులను
నీకాలము విడిగ వీరి సృష్టించుకొనెన్.

లక్షలాదిపురాణకాలములయందు
నెందు వినిపించనట్టి యీహీనజాతి
కలిమహాకాలమునకు యోగ్యమగునట్టి
చెట్టగుణములు పేర్చి సృష్టించుకొనియె.

సరి బేసై గవులె త్తిపోయినది యార్షంబైన యీనేల వీ
రులం దీసిన భారతీయుల శవా లూగంగ వృక్షంబులన్
భరమై పక్షులు ముక్కులం బొడువఁగా వ్రేల్లంగ రాకునిక్కిన్
బరు వయ్యెంగద ధాత్రీదేవతకు నీపాపంబు దావాగ్నియై.

పదివేలమందినైనను
బదిలక్షలమందినైనఁ బట్టున జంపన్
మది వెనుదీయరు వీరలు
నది చేయుట యెట్టు లన్న యాలోచనలై.

ఎంతమందిని జంపిన నంత భయము
ప్రజలలోఁగల్గి వీరల పాలనంబు
నిర్భయంబుగ సాఁగుట నీతిపథము
నులిపికట్టె ల దెట్టిదో తెలియలేరు.

ఇంత బరణిలోన నిమిడెడు సన్నని
యారుబారచీరదారములను
బట్టి తీయునట్టి పనివాండ్ర బొట్టన
వ్రేళ్ళు నరకినారు వీరజాతి.

ఈకృతభూమియందు జగదీడ్యము లైనవి యెన్ని లౌకికా
లౌకికముల్ విశేషము లలందురి నాశనముం బొనర్చి దు
ర్ధీకులు నిర్గుణంబులు స్వదేశజమైన పదార్థభావముల్
చేకొని వచ్చి పంచెదరు చెట్టలు లొట్టలు వేయఁ బామరుల్.

చాటుగ వచ్చి వాఁడు నిన్నుఁ జంపును మిక్కిలి దొంగపోటుగా
జాటి పగన్ వెలార్చెదవు సత్పురుషుండవు నీవు సర్వదా
మాటికి మాటి కిట్టు లసమానవిరోధము తప్పరాని పో
రాటములందు నీధరణిరాజులు నాశము కాక తప్పదే.

ఈదృశమైన ఘోరముల నెన్నియొ చేసినజాతిసేవకున్
బాదలిమూఁక యేపగిదిఁ బట్టెదరో మఱి వారి నాగరుల్
గాఁ దలపోయ వారి మది కాఁ జను నాదిను నెట్టిదో మృషా
వాదుల వారి నమ్మెదరు పామరతాగుణ మిట్టు లుండునే!

అంగనయైన బాలకుఁడునైన నెదే కొనుగోలుసేతకై
యంగడి కేగుదెంచెదర యచ్చట వారల ధృష్టతాగుణం
బుం గన నచ్చటే నరకి పోగ్రులు పెట్టున మున్నయంత వె
ట్టుం గలిగింతురి పాపపుఁగటాహము బ్రద్దలు కావు చెన్నఁడో?

ఇట్లు చేసిన జాతికి నేమి ఫలమొ
సాఁగినన్నాళ్ళు లిట్టులు సాఁగి తుదకు
శతసహస్రసమల్ బానిసలుగ నుండు
రేభవిష్యత్తునందునో మొఱుకలేక.

అంతట నతనికి మోహో
పంతున కనిపించె నొకప్రవాహము లక్ష్మి
శాంతాత్మనుండి స్వశక్తి
రాంతము వ్యాపించుచున్నయట్టుల నంతన్.

పగిలి తీవ్రానిలానలోత్థకార్పాస
కం బెంపుజిల్లెడుకాయవోలె
నదరి లాజార్థతప్తాంబరీషాంతర
కృతవల్గనము వడ్లగింజవోలె
ప్రిదిలి సుధాగ్ధవారినిషిక్తగాఢోష్ణ
రశ్మియౌ సున్నపురాయివోలె
విఱిగి హాసంతినివిష్టాధికాగ్నిత
ప్తము తోడుపెట్టిన పాలువోలె

వేఁడి తగ్గియు నడిజాము వాడి నెసక
గోడి పాసియుఁ దాపమ్ము మోడి విడక
యాది నవదశాచైత్రమాసాపరాహ్ణ
జరఠలుఠదాతపమ్ములు సందడించె.

---

# ఝాన్సీ రాణి

## తృతీయాశ్వాసము

౧

తెప్పట్లును డాకాలును
నుప్పర మొరసికొను గొంతు లొలసిన గానం
బప్పరి నొకనాఁ డుత్సవ
మొప్పెన్ బుర మెల్ల నందె యొరిగిన దనఁగన్.

కిటకిట లాడుచున్ జనము కేవల ముత్సవతన్మయత్వమై
కటకటలాడెఁ గాల్కదిపి కాలిడనైనను వీలు లేక య
క్కట! యపు డొక్కతెల్ల దొర కట్టిన గుఱ్ఱపు బండిపైనఁ ద
గ్గుట యని లేని వేగమున గుఱ్ఱములన్ బెనువీఁకఁ దోలుచున్.

జన మున్నా రని బండికిందఁ బడినన్ జావచ్చు నంచున్ శిశుల్
వనితల్ తప్పుకొనంగలే రనుచు నేభావంబు లేకుండఁ ద
గ్గని వేగంబున బండి మీఁది కుటుకన్ గగ్గోలుగానై జనం
బును జెల్లాచెద రైరి వచ్చి శకటంబున్ నిల్పఁగా నెంచకన్.

వాఁడు దొర, కోప మేచి తుపాకిపెట్టి
కాల్చి చంపును, జచ్చుట కాక వేఱ
చేయునది లేద, చేసిన సేన వచ్చి
యూరిపైఁ బడి మారణహోమ మగును.

అయిన దేశము గుఱగున యున్నంత సాహసం
బుడఁబోవ డెవరి కుర్వియందు
వేదజనులు తొలఁగి భీతావహంబుగాఁ
దొలఁగి మలఁగి కలఁగి మెలఁగఁబడిరి.

భయ మొకచిత్రమైనయది పై ముసుఁ గయ్యది యొక్కరుండు ని
ర్భయుఁ డరుదెంచి తా నిలచి పాపముతోడ నెదిర్చినన్ జనుల్
భయ మజి మూఁగిన చ్చెదరు పాపము నిల్వను లేద యప్పు డా
భయమును సిగ్గువంటి దది పాయదు సంస్కృతిలేనిజీవునిన్.

ఆయుత్సవమున లక్ష్మి
బాయియు నున్నయది తెల్లవాని దురంతం
బాయమహాదంతరంబున
మోయఁగరానంత బరువు మోసినయట్లు.

అని గుఱ్ఱంబులకళ్ళెముల్ గొని యవల్చన్ గుఱ్ఱముల్ ముట్టెలం
దునఁ గంపించుచు నొక్కసారి త్వరయందుం బిట్టు కుంచించుకొ
నును ఫుంజాలక గుబ్బసల్ గొనఁగఁ గోపాటోప మేపార నా
మెను వీక్షించుచు శ్వేతదేహుఁడు కశామృష్టంబుగా వేసినన్.

దెబ్బ తప్పించుకొంచు ధృతిఁ గశాగ్రహణంబు
చేసి యామె యిట్లు చెప్పఁదొడఁగె
బాధయన్న దెల్ల ప్రాణులకును సమా
నంబ యచటఁ దెలుపు నలుపు లేదు.

తనయంతఁ దా నెనఁడును
జనములపై నింతఁగాఁగఁ జనలేడు మఱిన్
వెనుకఁ గల బలము చూచుక
చను నాతఁడు తనకుఁ దాన చాలఁడు ధాత్రిన్

ఇంతమంది యుండి రిచ్చోట నిన్నేమి
చేసినను నిజంబు చేయవచ్చు
నప్పు డెవరొ వచ్చి యందఱిఁ జంపుదు
రద్ది నీవు బ్రదికినట్లు చెపుమ?

కాదు చచ్చి తెలియఁగలవె నీపగ యిట్లు
తీరె నంచుఁ, గాదు తెలియు నవినఁ
దెలిసె నీ కటంచుఁ దెలియదు పగవాని,
కద్ది పగయుఁ దీరినట్లు కాదు.

ఎవఁడు బ్రిదికియుండు నివి యెల్ల వానికి
బగ ఘటిల్లె ననుట పగయుఁ దీరె
ననుట తనదు జాతి యనుటయు జాతిద
ర్పంబు నెఱపుటయును బగులఁబడుట.

అని లక్ష్మి చెప్ప శ్వేతా
ననునకు విజ్ఞానరహితునకుఁ దినుటయునుక్
మనుటయుఁ జంపుట చచ్చుట
వినాకరించి తెలివేఁదు వీఱిడి కకటా!

కనులఁ నిప్పులు రాల లక్ష్మిని దొలంగందిసికొం చేగి గా
జన మచ్చోటను భూసురుం డొకఁడు సాక్షాద్బ్రహ్మభూతుండు ల
క్ష్మిని గన్నారఁగఁ గాంచి నిశ్చలదృగక్షీణపరిభావుండు ల
క్ష్మిని వెన్నాడుచు నేగె మందముగఁ దద్దేహంబు చేరంగనుక్.

ఆబ్రాహ్మణుండు మహారాజు ఝాన్సీ మ
హాధాత్రి వీరనారాయణునకు
సాధుమూర్తికిని గంగాధరరావు బా
బాసాహెబునకు నాప్తసచివుండు
వేదవేదాంగార్థవిత్తముం డార్యధా
త్రీఫరంగిపరాధీనతాని
వారణోపాయచింతారతుం డుదధిగం
భీరుండు నృపనీతివేత్తృమాళి

యాతఁ డాజానుబాహుఁవు నర్థవిత్త
ముండు నర్చస్వి యాతఁ డొక్కండు లేక
యవతరించిన సింహవాహనము ఫలము
లేకయుండెడి దాతఁ డక్షీణపుణ్యు.

ఆని స్నేహమ్ము పిదప సాహాయ్య మంచుఁ
గోటలోపల దనుసేన కొంత పెట్టి
యన్నివిషయంబులందు జోక్యంబు కలుగఁ
జేసికొని కీలుబొమ్మలఁ జేసి నృపుల.

బక్క రాజ్యంబు లన్నిటిఁ బుక్కిలించి
మంచిరాజ్యంబులందునఁ బొంచి యుండి
పెద్దనక్కలవలె మెడ పిసికి చంపు
నాఫరంగీల భయ మెక్కువై ధరిత్రి.

(శ్రీ) కేళీధృతి కృష్ణరాయలు శివాజీబాజిరావుల్ మొగల్
భూకాంతుల్ రిపుకంఠకర్తనకళాపుందుర్గలై స్వర్గవీ
థీకేళీరతి నేగఁగాఁ దెరచినిల్ తీరైన యీధాత్రి నే
కాకుల్ కుక్కలు వచ్చి మైలపరుపంగా నౌ పురోడాశమై.

మరి దిటవై యొకం డసహమానపరాక్రమశాలి ధారుణీ
భరగురుకార్యనిర్వహణపాండితిశౌండుఁడు మాతృదేశబం
ధురతరదాస్యశృంఖలలఁ ద్రుంపఁగఁజాలినవాఁడు ధర్మని
ర్భరధిషణాసనాతనుఁడు రా జొకఁ డుద్భవ మందఁగావలెన్.

సాధితబీజభూతమగు సర్వగుణంబులు కల్గువాఁడు గం
గాధరరావు క్షేత్రి మది కావలె యోగ్య మొకండు నామె కై
యీధరణీసురుండు చరియించెడు గాంగతటంబునందు ఝూ
న్సీధరణీతలేశ్వరుని చెల్వయుఁ గాఁదగినట్టి చెల్వకై.

చెలు వొప్పం గనిపించె నిచ్చటను లక్ష్మీబాయి శౌర్యంబు ను
జ్జ్వలధీశాలిత నిశ్చయత్వము రిపుస్వాంతంబు నూటాడు దో
హాలనైశిత్యము భావిశూరజననాహంకారతేజోఽబ్ధియై
తెలచెన్ మంత్రిహృదంతరంబును సమాధిప్రోతశౌర్యాగ్నియై.

ఆమె నిమ్మని యడిగె ధరామరుండు
నామె నిచ్చెద ననియె ధరామరుండు
రమణితో ఖడ్గవిద్యయు రాజనీతి
కైవసంబయ్యె నాఁడు గంగాధరునకు.

ఆనాఁ డుజ్జ్వలమూర్తి లక్ష్మి పతిగేహం బేగుచో నాకౌయుక్
నానాసాహెబు కత్తులం గలిపి ప్రజ్ఞాచక్షువుల్ గాఁ బ్రతి
జ్ఞానిర్వ్యాఘవచస్కులై చన మహాఖడ్గధ్వనుల్ గా భుజం
గీనిశ్వాసరవంబులై దశదిశాక్రీడల్ విజృంభించినన్

గంగాధరుఁడును సతి న
ర్ధాంగమున న్నిల్పె శిరసునం దిడికొనె రా
జ్యాంగములందునఁ గుటిలఫ
రంగులకున్ గుండెలన్ సురంగములు పఱెన్.

రాణిమాటమీఁద రా జంత నిలుచును
రాణికత్తి బెసగరాని మిత్తి
మరి ఫరంగిజాతిమరఫిరంగులకైన
రాణిమాట మీటరాని కోట.

అల పెఱచోట్లవలె ఫరం
గులకు యథేచ్ఛముగను చెడుగు ల్లాడఁగ పి
ల్లలుగమి నచ్చట వారికి
బలవంతముగా మనుష్యభానము పట్టెన్.

అగడిత సర్వకాలములయందున నీళ్లల నింపి యుంచు, బీ
టగుపడఁ గోటగోడ నపు డప్పుడ రాతిబిగింపు చేయు, దూ
యఁగల ఫిరంగులన్ బురుజులందున బారులు చేసి యుంచు, సం
యుగసమయంబునందుబలె నుంచును దుర్గము సర్వవేళలన్.

గరిడీసాలలు నిచ్చలు
పురమునఁ బనిసేయుచుండు మాయఁగరాకన్
గరవాలవిద్య యెందుం
గఱపుదు రవి రాణిగారికడ నేర్చినటుల్.

దక్షులు సర్వదా సముదితంబుగ నూతనపద్ధతిన్ జమా
శిక్షణ చెప్పుచుండఁగను జిహ్వకుఁజాలిన గుండెబంట్లుగా
రక్షణవృత్తికిం బఱుని రాణియు నున్నది ధైర్యసర్వతా
నఁక్షులబోలె సైనికచయంబును బారులు పొల్పుచుండఁగా.

ద్రుతి నేమాటయు సాఁగదు
స్తుతి గుజ్జపు బొత్తు సడను వెలిఁగెఁ జాటుతనం
బతుకదు పాచిక పారదు
గతుకుడు పడదున్ ఫరంగికంతములాదున్.

ఒక యేయించుక యేది హేతువుగ నేదో మాటకేనిన్ ఫరం
గి కమర్యాదను జేయరాదను, ఫరంగివాఁ డమర్యాద యిం
చుకయుం జేయఁగరాద యెవ్వరికి ముచ్చింపోకడల్ కూడ నే
రొకఁ డేయెక్కువ లేదు తక్కువయు లే దొక్కండు మర్యాదకున్.

అంగములలో ఫరంగుల
యంగనలాదిగ దురాగ్రహము గర్వంబుం
బొంగులు నెఱపిన వారికి
నంగములం దేపదార్థ మమ్మరు జనమున్.

ప్రాణము జాతిగర్వమునకంటె మహాధికమున్ బవిత్రమున్
బ్రాణము తెల్పి నల్పి తెలియంగనుఁ జాలర యెవ్వరైన మా
ప్రాణము భారతీయులకి కయ్యమునం దొకనేర్పు శీలసం
త్రాణము కాదు స్వార్థపుమతంబును జెప్పినఁ గారు దేవతల్.

ఈ నేలంగలయట్టి నాగరకతాహేలామహత్కృష్టి యెం
దేనాఁడుం బెఱచోట్ల నుండ దొక యా యేనాఁడో నీవున్ మరిం
కేనాఁడో యది నేనుగా గెలుతు మాయీగెల్పు దైవంబుగా
నీ! నీ నా మగలక్షణం బగుట లేనేలేద యేనాటికిన్.

అప్పుడు గ్రీకుజాతి మరి యప్పుడు రోమనుజాతి యాపయిన్
గొప్పగ ఘోరించివాండ్రు నదిగో నిన మొన్నగ స్పైనుజాతి మీ
రిప్పుడు రే పెవళ్ళొ యిది యెన్నఁగఁ బశ్చిమపుంజరిత్ర యా
గొప్పకు నప్పు దుబ్బ పదిగోళ్ళను జుట్టును బీకుకొందురా?

జుట్టును బీకికొన్నయెడఁ జూడుడు బోడి యగున్ శిగస్సులున్
బెట్టుగ న్యాయపీఠముల విగ్గులు తాల్తురు జుత్తు న్యాయ్యమై
గట్టిగఁ బీక నేమిటికిఁ గావలె నంచును న్యాయచిహ్నముల్
పెట్టఁగ నేటి కావెవరో పెంపిరాంగన్ గొరిగించుకొన్నవిన్.

మి మ్మిగ మీరు కాదుగద మిమ్మును సృష్టిని జేసినట్టి దై,
వమ్మును బుట్టినప్పటికి భారతజాతి మహర్షి భావసాం
ద్రిమ్మగనైన నాగరకతాఖని, యిచ్చట మీరు పిచ్చి వే
సమ్ములు వేసిన౯ బిగువు చాలదు పండితగోష్ఠులందున౯.

అని స్నేహంబు పరాచికంబు మిళితంబై యాడఁగా, రాణి కా
దనరు౯ గోపము లోనఁ బొందుచునె పైహాసమ్ము లాస్యాంతముల్
గొనఁగాఁ జేతులు మూసి పోదురు ఫరంగుల్ రాణికి౯ రాజ్యపా
లనమం దర్వది భర్తతోఁ గలియు వేళ౯ వింశతిప్రాయము౯.

రాణి రాజ్యాంగవిషయధారావిమర్శ
చేయునప్పుడు దేవతాసింహమూర్తి
లక్ష్మి పతివద్ద నున్నప్డు లలితలలిత
ప్రణయమాధుర్యసామ్రాజ్యపట్టమహిషి.

లక్ష్మిరాజ్యాంగవిషయహేలాప్రసంగ
రూక్షితం గని గంగాధరుండు నవ్వు
రాణిశృంగారహేలానురాగమధుర
భావముం గని సతిఁ దలపై ధరించు.

వెలఁది! కోపమ్ము నీకు శోభించునట్లు
లన్యభావమ్ము శోభించ దనుచు భర్త
ప్రణయకోపాన శృంగారభావ మురలి
లక్షు శోభించుచుండును లక్ష్మియందు.

కలలో లక్ష్మికిఁ గానిపించు నెపుడు౯ గంగాధరుం డెవ్వరో
లలనారత్నము కోపగించఁగను హేలాహాసముల్ చేయుచు౯
కెలనం దా నటుఁ గూరుచుండి పతిపైఁ గేళీవిలాసాక్షిసం
వలనం బొప్పఁగఁ జూచుచుండుఁ బతియు౯ మన్నించు మన్నించదు౯.

పలుకంగా మది నెంచు భర్తకుఁ గల౯ బ్రాభాతశృంగారవే
ళల గంగాధరరాజశేఖరుని కేళాకూళి యన్నట్టి బా
హులఁ బ్రేమార్ద్రిపు నీటిజల్లులను వేరో వారు తద్దేవతా
లలనారత్నము లంచుఁ జెప్ప మఱచు౯ లావణ్యరేఖాబుల౯.

ఇరువురి మోహావధులను నెత్తిన యౌవనగ్రీష్మతాపమై
యొగసిన ప్రేమభావజలదోత్కరమై మృదుచాటుగర్జలై
తరుఁగని శోభలా గిరినితంబములందునఁ గేళిదీర్ఘికా
సరసుల జల్లు లెత్తెనవి శాంతవనీతరుషండవీథులన్.

ఆజానేయము లెక్కి యిద్దఱును మేఘాడంబరం బొప్పఁగా
రాజత్కేళి గిరీంద్రకాననధరాప్రాంతంబులం దేగుచున్
భ్రాజత్కేకివిశీర్ణబర్హసుషమల్ కోలెత్తు నేత్రంబులన్
రాజున్ రాణిని గాంచు రాణిని గనున్ రా జూర్జితోత్కంఠతన్

కొండనెత్తములందున గుర్రములును
వీడు విహరింపఁ జుట్టును విస్తరించి
నట్టి తెల నల మబ్బుల నందగింత్రు
వచ్చియున్న పర్జన్యదంపతు లనంగ.

వర్షేందిరయుఁ గేశపాశమ్మునందలి
మెఱుపుఁబూవులు చూపె మేదినికిని
ధారుణీసతియు నందము మెచ్చినట్లు చి
క్కని కుక్కగొడుగులుగాఁగ నవ్వె

నెక్కడి కక్కడి కెండించి తరురాజిఁ
గావలోపలఁ గానరాని దొంగ
పసిమియంతయు నేఁడు బయటఁబెట్టె వియత్తు
గుర్తించికొని పట్టుకొనెఁ గుభృత్తు

ఎడమొగము పెడమొగమైన యిలయు మిన్ను
లయు పునస్సమాగమము పుల్కలుగ నిలయుఁ
జాటు మంజులవ్యాహారసరసవర్ష
ణములుగా మిన్నులయును బంధములు చెలఁగె.

# ఝాన్సీ రాణి

## చతుర్థాశ్వాసము

౧

ఉర్వీనాథున కయ్యె సుతోదయంబు
ఉర్వీప్రజలకు నయ్యె సూర్యోదయంబు
వృక్షశేఖరరవసమర్పితమనోజ్ఞ
రజనికాత్యయముగ నయ్యె ద్విజకులంబు.

తతమహారాజనీతివేత్తృతయుఁ దనది
యయ విధానము ఖడ్గవిద్యయును దనది
విశ్రమస్థానమును బొందు విధి యంచుఁ
బరమహృదయంబునను లక్ష్మిబాయి తలఁచె.

శిష్టగుణశీలంబు దుష్టశిక్ష
ణాధికబలంబు నిత్యధర్మాభిరతియు
జననముం బొందె నంచును సంతసించె
సాధువగు ద్విజశ్రేష్ఠుఁడు సచివమాళి.

సతి గడ్డమందు నొక్కం
చితముగఁ బలుచని మొగంబు చెక్కిలి యెమ్మె
న్నడి కొంచెము కన్ధగ ధగ
క్షితిపతి తా లక్ష్మియందు శిశువుం గాంచెన్.

ఝాన్కాంతావళి మొల్లఁ గావలయు నిస్సంతాన మీసర్వధా
త్రీకాంతత్వము తా మెం బొందవలె సాధింపంగ నీకో[illegible]నా
నాకూళ్ళం దినుచున్న శ్వేతముఖసంతానంబు హృద్వ్యాధులం
దాకంతంబుగఁ బొందె దుఃఖము నతాస్యంబులై కృతక్లాంతులై

సారిదిన్ మాటికి మాటికిం గలలు వచ్చెన్ రాణికిన్ వానిలో
నరుదొప్పన్ గనిపించు నాయువతియో యాదేవతామూర్తియో
మరియుం దాఁ దనబిడ్డవంక గనుచున్ మ్లానాస్యయై చూచు నం
దిరవై యుండిన స్వామిమోమునఁ బ్రభుం డింతింతగా నవ్వఁగా.

ఆకలలలోన న్నాశిశు
వాకుంచితదేహయష్టియై పతి నవహా
సాకారకసుషమాంశుల
నేకై కనిపింపకుండు నిందుపగింజై.

సచివపురోహితుతో, నిది
వచియింపఁగ నెంచు రాణి పతి సుతుఁ బో
రచిగాఁగ నెత్తి నిడుకొని
కిచకిచ లాడింప మఱచుఁ గేళీరతయై.

కొన్నికలలు హత్తుకొని మనఃఫలకంబు
నం దెసంగుఁ, గొన్ని యల్ల నల్ల
గాలితరఁగలందుఁ దేలిపోవుచునుండు
నిలువరింప వల్పనీర మట్లు.

కలల లక్షణంబుకాని యియ్యది వాని
ఫలితమందు సుంత పట్ట దిద్ది
ఫలము ఫలమె వాని నిలుచుట నిలువమి
వాని కవియె రెండులోను గావు.

బిడ్డమీఁది రాణిప్రేమ లోపల సగా
నికి సగంబు వాఁడు నిలుపు తనదు
వంశ మంచుఁ గాదు వాఁడు పరంగి మూఁ
కలను బారఁద్రోలవలయు నంచు.

ఒకవిలక్షణమైన లౌకికపుఁ దెల్వి
యలఫరంగిజాతికిఁ గల దందులో నొ
కండు మేధావిశేషసంకలితుఁ డనియె
నెంచి నిజమాఁడినాఁ డనిపించునట్లు.

నలి వ్యాయామనిరంతగాఢకృతబంధమ్ముల్ సతీదేహవ
ల్లులు పుష్పించవునుం ఫలించ వాకవీలుంబట్టి యట్లైననుఁ
ఫలమున్ నిల్వ దటంచు శాస్త్రధిషణాపాండిత్యమున్ వోని యా
పలుకుల్ నిక్కమువో లెఁ గన్పఁడె ధరాపాలేంద్రుబాలున్ గనన్.

బాలారిష్టము లెక్కువ
వేళ్లాడెడుఁ దోటకూరవిధమున మరియున్
బా లానడు తల్లి కడన్
బా లైనను లేవు నలతఁబడియెన్ శిశువున్.

పిల్లవాని కస్వస్థత పెరిగిపోయెఁ
గోటలో నగదంకారకోటి కోటి
కెక్కు జతనంబు లన్నియు లెక్కలోకి
రాకపోయెను పట్టియత్నాక లగుచు.

శిశువు దక్కలేదు చివరకుఁ బదినాళ్ళ
దా ప్రయత్న మెల్ల వ్యర్థ మగుచుఁ
బ్రిస్తరంబుమీఁదఁ బడినట్టి వర్షంపు
నీళ్ళు లెంతసేపొ నిలువనల్లు.

ని గ్గెఱెఁగెఁ బురోహితుఁడొ
పెగ్గడ ధర్మమ్ము వ్యభిచరించెడుఁ గలితో
నుగ్గము కట్టిన నిలుచునె
యుగ్గముతాళ్ళుల్వి చివికి యుండినవైనన్.

మేదినిభర్తయున్ వయసుమీఱినవాఁడు సుతుండు గల్గ భా
గ్యోదయ మంచుఁ బొందినమహోత్సవమంతయు వమ్ముగాఁగ మ
ర్యాదను వీడి దుఃఖపడ నాయనదేహమునందుఁగూడ రో
గోదయ మయ్యె వమ్మగు ఫలదోయ మెంతటి దుఃఖహేతువో.

ృపసుతుఁ డీవిధాన మరణించినయంతన కట్టినట్టి మే
 పగిలిపోయినట్లయి కడంకను మాలినయట్లు ధర్మలో
పమతికూడ నేఁటి కని లోపలఁ బ్రెగ్గడయౌ పురోహితుం
పగతరాజకార్యమతియై చరియింపఁగఁజొచ్చె నంతటన్.

ాభవవీథికన్ సకలబాధ్యతలున్ దనపైఁ బడన్ ధరి
త్రీభరణంబు, భూపతిశరీరనిరామయభావదృష్టి, పౌ
రాభయకార్యనిర్వహణ, మల్ల ఫరంగులతోడి నీతి, వి
ద్యాభరసాధ్యమైన వ్యవహారము రాణియె నిర్వహించుచున్.

యుద్ధపుటేనుఁగుల్ సొలచు, నుగ్రతరాశ్వము స్వారి నొంచు, ధీ
క్రుద్ధత శాత్రవాళిఁ గనుగొల్కుల బద్దల విల్చుఁ, దర్కవా
క్సిద్ధి రాజనీతి వివశీకృతులం గలఁచున్ ఫరంగులన్,
విద్ధము కాద రాజ్యపదవీస్థితి నాయమబుద్ధి యెన్నఁడున్.

కోటలోపల మఱియును గోటబయట
నన్నవస్త్రములకు లోప మనుచు లేదు
యుద్ధసమయంబులకు నిల్వయున్నయట్టి
వస్తువే నిచ్చు నెవఁడైనఁ బస్తు లున్న.

మని మృదువైన రాణియుఁ గ్రమక్రమపద్ధతిధారుణిప్రజా
హృదయము లెల్లఁ జూఁగఁగొనె నెక్కడి కక్కడ నార్యధర్మసం
పద పరిరూపము ల్గొని సమంజసతాస్థితి నిల్పుకొన్న ద
న్నది నవితంబుగాఁగను సనాతనభావము పాడుకొల్పుచున్.

రాణి ప్రజలలో నొకనిమర్యాదకొఱకుఁ
బ్రభుమహాభావ మంతయుఁ బణము నొడ్డుఁ
బ్రజలలోఁ బ్రతియొక్కఁడు రాణికొఱకుఁ
దనతనూరక్త మంతయు ధారవోయు.

నృపులు స్వభోగలాలసులు నీరసపెట్టుదు రెల్ల భూప్రజా
నుపమధనంబు గైకొని జనుల్ తినఁ దిండికి లేక మాడ నం
చుపములు చెప్పి భూప్రజ నహో కికురించు ఫరంగులున్ మృషా
లపు లని తేలిపోయె నవలామణి లక్ష్మి ధరిత్రి నేలఁగా.

పరలోకంబులు పుత్త్రిదత్తజలసంప్రాప్యంబులం చీమహా
ధర విశ్వాసము పుత్త్రి లౌరసుఁడునున్ దత్తుండు నైదంయుగీ
నఋషుల్ చేసిన నిర్ణయం బిహపరానందైకసంధాయులై
గుమధర్మం బిది నేర రింతయు ఫరంగుల్ మృణ్మయుల్ మృణ్మతుల్.

పుట్టక పుట్టకే కొడుకు పుట్టెను, వంశము నిల్పె నంచుఁ జూ
పట్టిన మోదకుల్య యొకపట్టున నిల్వక వట్టిపోయె నా
పట్టిఁ దలంచి మంచము బట్టె ధరాపతి పుత్త్రుఁ డంచుఁ గ
న్పట్టక యాత్మశాంతి కనుపట్ట దటంచును రాణి యెంచుచున్.

దత్తత చేసికోవలయు ధారుణినాథున కాత్మశాంతిసం
ప్రతిఘటిల్లఁ జేయ నని మానసమందున రాణి యెంచుచున్
దత్తునిఁ దెచ్చె నొక్కని సుధానవహాసుని బాలకున్ యదా
యత్తము ధాత్రి సర్వశుభ యానను మంజులలక్షణాన్వితున్.

తన్ర కొక్కారు మెరుంగుచిర్నగవులోఁ దన్వారు లేఁజెక్కులం
దునఁ గ్రొన్నెక్కులఁ జిట్టితమ్మిమొగమందున్ దేంట్లుగా వ్రాలి మూ
గినవౌ ముంగురు లల్లనల్ల జిరుకెంగేలం బెడన్ ద్రోసికొం
చును దత్తాఖిలపుత్రసౌఖ్య మొసగించున్ రాణికిన్ రాజసున్

చెలు వొప్పంగను వృద్ధరాజుతొడపై సింహాసనం బుండు రే
ఫులఁ బట్టాశ్వముమీఁద రాణి కెలనన్ బోవుం బురంబందు నూ
పుల వాహ్యాళికి రాజకార్యనివహంబుల్ చూడఁగా భూప్రజా
వలిభావంబుల మెల్లఁగా ధరణిభృద్భావంబు నిండారఁగన్

అరుదెంచున్ యువరాజుఁ గాంచి యెవరయ్యా వారు ఝాన్సీధరా
వర దామోదరరావు భూతిలక బాబాసాహెబుంగారు వ
చ్చిరయా హెగ్గడికాండ్రు లే రిచట వేంచేయుండు వేంచేయుఁడం
చరకన్నుల్ చిరునవ్వులుం జెలఁగ ముద్దాడున్ ధరాకాంతుఁడున్

నన్నుఁగన్న నాన్ననా నౌరసుం డొప్పు
నేను కన్న నాన్ననా నెసంగు
దత్తుఁ డిద్దరైన తనయులు తనువున
మనసునందుఁ గలిగి మమత గలుగ

ఆకొడుకు పోయినందుకు
మేకొను దుఃఖమ్ము దుఃఖమే మలిపూవై
యీకొడుకు వచ్చినందుకు
మేకొను సౌఖ్యమ్ము సౌఖ్యమే చిత్రముగన్

వేయిభావములు వివిచ్యమానములుగా
వేఱుపరచి యనుభవించు మనసు
జీవిలక్షణంబు చిత్రమ్ము, దేహము
కోటిత్రోవల కలగూరగంప

ఎంచఁగ వేయిమార్గముల నేగెడు జీవనధారలందు సా
ధించగ నేకమార్గమున దెచ్చిరి ధర్మము ప్రాక్తనుల్ ఋషుల్
వంచితమృత్యువుల్ సుకృతవల్లిసుమంబులు రాజు, రాణి ధ
ర్మాంచితబుద్ధి దత్తసుతు సారసుఁడట్లు తలంచుచుండఁగన్

అర్మిలి నంత ధర్మములయాచలమంజుసుషీమవాయుసా
ధూర్మ్యలయందు సన్నని కవోష్ణతరంగ మొకండు తోఁచె నం
తర్మధురాయమాణసుమనస్సుఖభావన తియ్యనీటిలోఁ
గూర్మములన్ హరించు నొకక్రూరము నక్రము తోఁచినట్లుగన్

పంట మొగమయి యుండిన పైరునకును
పైనఁ బట్టిన మబ్బులభయమువోలె
నలలచే నూగు నిండుతటాకమందు
పగిలి యొకగండి పడునన్న భయమువోలె

సన్న వేఁడిరేక సాగువారు నటంచు
నెవఁడు చల్లగాలి యెదురు పోఁడు
గండి పడునటంచుఁ గలఁగి యెవ్వఁడు చెర్వు
కట్ట లురల నీరు పెట్టుకోఁడు

కొడుకునకున్ యువరాజ్యపు
గొడుగుం బట్టించు పండుగుం జేయంగా
నొడయఁడు తలఁచిన నందఱు
గడుకొని తా మన్యధరణికాంతులు రాఁగా

తా నచటఁగల ఫరంగుల
సేనాపతి వచ్చి యిట్లు చెప్పెను దత్తుం
డైనకుమారుఁ గుమారుం
గా నంగీకృతి యొసంగఁ గాదని తమకున్

లార్డు "డాలుహౌసి" ఫరంగులకు నధిపతి
యట ఫరంగులదగు దేశమందుఁ గలుగు
రాజప్రతినిధి యతఁడు సూత్రమ్ము పట్టి
భరతదేశము మ్రింగెడు పథము పూని

కణకణ లాడె నిప్పుకలు కన్నుల రాణికిఁ బ్రెఁడికింకిణుల్
కుణుకుణులాడఁ గానునఁ జకోరిక సంజను రెక్క సాచుచున్
మణచినయట్లు కంటితుద మాడిన వైఖరి గాఁగ రాణి మా
ర్గణమును బోలె వచ్చు యువరాజును జంకకుఁ దీసికొంచుచున్
చనియెను దోన యుత్సవము సాఁగె ఫరంగియు ద్వారదూరమం
దున నిలుచుండి చూడఁగ జనుల్ జయవెట్టఁగఁ జామరానిలం
బున యువరాజమౌళిపయిఁ బూంచిన కల్కితురాయి యూఁగఁగా
వినదితతూర్యనాదములు నింగిని నిండి ప్రతిధ్వనింపఁగా

అడరెను మహోత్సవాకాశ మంత రాణి
మొగ ముదయసూర్యరక్తాంశువుగ నరపతి
తెల్ల మొగ మస్తమించు జాబిల్లియుగను
బ్రతిపదుదయంబువలెఁ గృష్ణపక్షమందు

లక్ష్మిబాయి మొగంబునఁ బక్ష్మలములు
వ్రాలినది లేద యనిమిషవనితకట్లు
అలఫరంగిసేనాపతిసెలవి యార్జ
నమును గనలేద మరి పిశాచమునకట్లు

ఒకమహోత్సవమట్లు లే దొకమహోగ్ర
సైనసంగ్రామమున కాదియైన నాంది
జరుగుచున్నట్లు లైనది సౌరదైత్య
శక్తులకు భావివేళాప్రచండములకు

వేరిహృదయంబులందున వారివారి
ధైర్యహేతువు లున్నవి ధర్మ మొకట
నొకట ననుకూలమైన కాలోగ్రశక్తి
యొంటెమెడవలె వక్రమై యున్నశక్తి

పైకి శరదాతపములు జాల్వారినట్లె
లేఁతనవ్వులజిగి పిసాళించుచుండ
వెస ఫరంగి తాంబూలము స్వీకరించెఁ
గ్రమ్మకొనిన శిరోవేష్టనమ్ము తీసి

చిందిపోయెను వయస్త్రీశోభ సిరియఁగాఁ
బచ్చాకు బంగరువన్నె తిఁగి
వైడూర్యశకలముల్ పట్టి కుప్పలు చేయు
గతి నున్న యందాలకంకె వదలి
వలయాకృతిములు శోభాతరంగావలుల్
గగనవీథికకు మెట్లుగ సమర్చి
ఇట ముదాకృతిదేవు నెగచి పయోధర
ప్రౌఢవారిగజపతిని జేసి

అనయపథజననేత్రికుట్టననిమిత్త
మైన సౌష్కల్య మేచి యూహాలకు నూహా
సొగసు సంపాదనము చేయుచున్న దదిగొ
శరదమలమూర్తి కేదారసస్యలక్ష్మి.

---

# ఝాన్సీ రాణి

## పంచమాశ్వాసము

౧

ఆక్లాడు కళ్లె యీకోడు
కాకారము చూడ సంశయగ్రస్తుండై
భూకాంతునకును జింతా
వ్యాకులతను వ్యాధి యుమ్మడై ముమ్మడియై.

ఇదివరకె యీమహామారి యెన్ని యెన్నొ
రాజ్యములు మ్రింగినది తనరాజ్యమునకు
వంతు వచ్చిన దిపుడు తప్పదు ధరిత్రి
రమణునకు గుండెలోఁ బెద్దరాయి పడెను.

లక్ష్మీశౌర్యాబ్ధి యాంగ్లేయులను నెదిర్చి
సర్వసంహారకార్యంబు సలుపుఁగాని
భావివంశాంకురము నిల్పుకొనఁ బోదు
పేరునకునైన నిల్పెడు పెరిమఁ గనదు.

తనయనంతరకథ యెల్ల ధరణిపతికిఁ
గనులముం దాడి ముందుకుఁ జనిన గోయి
వెనుకకుం జన్న నూయిగా విన్నతనయునుఁ
డడియు నొకవ్యాధిగా నయి యటమటించి.

మరియు ఫరంగిజాతి బతిమాలి మహావినయంబు చూపి మీ
కరుణ యటంచు నైచ్యమునఁ గాళ్లను వ్రేళ్లను బడ్డనైన నా
సురమగు జాతియై శరణు జొచ్చినవారినె మ్రింగు నద్దిదు
ర్భరమగు కాలమై భరతరాజ్యము మ్లేచ్ఛులపాలిదై చనన్.

క్షత్రియవంశముల్ కలి యొసంగిన వేయిసమల్ గతింపఁ జా
రిత్రము మాలిపోయెను ధరిత్రి శకుల్ యవనుల్ గతాత్మలా
గోత్రము లేగుదెంచినవి క్షోణిసురుల్ మొదలన్ జమూపతుల్
ధాత్రిపతుల్ క్రమాననయి ధర్మము నిల్పుచునుండ నిత్యమున్.

బ్రాహ్మణేతరులైన భూపాలకులును
బ్రాహ్మణుల మంత్రులుగఁ జమూపతులు గాఁగ
నిల్పికొని యార్యధర్మంబు నిల్పుచుండ
మొదటికే వచ్చె మోసంబు ముంచుకొంచు.

నాలుగుమూలలందున సనాతనధర్మ మనంగ ద్వేషపుం
జ్వాలలు పెల్లు రేగినవి బ్రాహ్మణజాతి సగానికిన్ సగం
బాలరిమూఁకయై పరమమైన త్రయీనవధర్మవిద్విష
జ్జాలముగాఁగ మారినది సత్యపథం బిఁక నేమి కావుటో!

తురకలు వచ్చి మార్చినను దోలటిస్వాచ్ఛత యేకదేశమా
ధరణి సనాతనంబయిన ధర్మపథం బది నిల్పుకొన్న తీ
విరిసిన పూఁక సితిపదవిం దడిగుడ్డలతోడ గొంతుకల్
తమఁగుచున్న దీయులుచదారి విదారితసర్వధర్మమై.

చవుకరకంబు ఖావముల సందడి దండడిచేసి నిత్యవై
భవమగు దేశమున్ దినను బట్టను గట్టను లేక చేసి నో
రు విడిలినన్ గృపాణముల రూక్షముగాఁగను గత్తిరించి యు
త్సవ మని నీచనాగరకతామతవైద్యము లిందు నింపుచున్.

తపసొమ్ముగాని యీదే
శముసొమ్మును దోఁచి మూఢజనులకుఁ బెను జీ
తము లిచ్చి వారిచేతనె
మము వంచింపఁగనుజేయు మార్గమువారై.

ఆరవపాలు రాజునకు నప్పన చేయుదు రంతకంటెనున్
వేఱగు బాధయే యనుభవించు టెఱుంగరు నేఁడు భూప్రజల్
ఏరయి యెన్నిపన్నులను వేయుచు వేఁచుకతిందురో ప్రజన్
ధారుణి యేమి కావలయు ధర్మము మర్మము దూసిచన్నటుల్.

పండినదానిలోన నొకపాలు కృషీవలుఁ డిచ్చుఁ గష్ట మం
దుండదు దాని నమ్మి ధర యుయ్యేల లూగుచునుండఁ బైన నొ
క్కండును గ్రింద నొక్కఁడునుగా బ్రదుకే కొనుగోలుగాఁగ నై
యొండిన జీవితంబులయి యేమయి పోవుదురో యిఁకన్ బ్రజల్.

కలిసి పండిచుకొందురు, కలిసి పంచి
కొని భుజింతురు, కూటికి గుడ్డకైన
లోప మెఱుఁగరు ధారుణీలోఁ బ్రజాళి
యయయొ! ఏరల బ్రతుకులు బయటపడును.

ఇచటి వృత్తు లన్నియు హరియించి తమస్వ
దేశజములైన వస్తువుల్ తెచ్చి యిచట
మొదటఁ జవుకగ నమ్మించి పిదపఁ జేయుఁ
దలకుఁ దాటిప్రమాణమ్ము దాఁటునట్లు.

మానము ప్రాణమున్ గుటిలమానవు లీతెలిజాతిచేతులం
దూనుచుఁ గట్టుగుడ్డ తమయూళ్ళలనుండియ యిందురావలెన్
జేనులఁ బండుపంట తమసీమకుఁ జేర్తురు లేనిచోటికిన్
మానవు లిందు మోహమున మాఁగిన బుద్ధులె తిండిగుడ్డలై.

ఈగతి వృత్తు లెల్ల నశియింపఁగఁ దిండికి లేక యెల్ల రు
ద్యోగముకోస మెక్కడర యుట్లకు నుట్లని పోయి పోయి యా
పై గగనంబునన్ నిలుచు వానినిఁ గొట్టెదు నేర్పుకాంగ్రసున్
రాఁగల యుట్లతద్దులను రాజిలుచుందురు తందనాలుగాన్.

ఇప్పు డతివృష్టి కలిగిన యీధరిత్రి
నపు డనావృష్టి కలిగెడు నదియు నిజము
కరు విపుడు పండనట్టివా గ్రామములనె
కరు వపుడు కల్గుఁ బండిన గ్రామములను

ఎవరిని వారితిండి తిననీయక క్షత్రియుఁడైన రాజు తాఁ
దినియెడు పన్ను దోచుకొను తీరున వర్తకుఁడైన రాజు బం
ధువువలెఁ దోచి నూటికిని నూఱును లక్షయుఁ గోటి లాగు నీ
యవనికి వర్తకుండు ప్రభు వైనచొ గుర్తు దరిద్ర మాటకున్.

ఒక్కచేతఁ గత్తి, యొకచేత మతమును,
పరగ నొక్కచేత వర్తకంబు
భరతధాత్రి కకట! వచ్చెను వీఁ డొక్క
చెట్టబుద్ధి జేసిచేతివాఁడు.

కత్తి కలుగు చేయి ఖండింపవచ్చును,
లక్ష్మిగాని వీరలక్ష్మిగాని
మిగిలినట్టి హస్తయుగము పామరజన
మోహగములు త్రెంచఁబోవరావు.

అతిథిగ వచ్చెఁ జోరుఁడు గృహస్థు నెఱింగియు నక్కటా! గృహా
గతునకు నేను భోజనము కాదని చెప్పన టన్న ధర్మతీ
వ్రతకలఁడేని యేమి యనవచ్చును దోపిడి నిశ్చయంబు దు
ర్మతియగు చోరుఁ డాగృహిని బ్రాణములన్ విడుచే ముదం బగున్.

లక్ష్మితోడఁ జెప్పి లాభంబులే దిది
యామె యెట్టులైన నఱుముగాదె
వచ్చె వీఁడు ముక్కుపచ్చ లారని బిడ్డ
దత్తుఁ డనుచు మృత్యుదత్తుఁ డగుచు.

అను మహాప్రవాహమునం
దునఁ బడి గంగాధరుండును భూపతి వా
రినిబిడకాలాంబుధిలో
మునిఁగి చనియెఁ గోట యెల్ల బోరన నేడ్వన్.

పిల్లలను నంటిపెట్టుక పెంటికోడి
యొకటి యక్కోటలో మేయుచుండె వాఁడి
ముక్కుగలయది యాకాశమునఁ జరించు
శ్యేన మొకఁడు వేళం బ్రతీక్షించుచుండ.

---

౨

దత్తుఁడైన తనయుఁ దనయునిగాఁగ నం
గీకరించ మేము, క్షితిని వదలి
రాణి పోవలయు, రమణ నస్మద్దత్త
భృతిని గొంచుఁ దాను బ్రతుకవలయు.

ఇది మారాజప్రతినిధి
మొదలించిన యాజ్ఞ, దీని మేఁలని తాను
వదలి చనవలయు, నచటి దు
ముదారునకును నధికారమున్ వదలవలెన్.

ఈనేలన్ వహియించు మాప్రభువు తా నింగ్లాండునందుండి మా
సేనాధ్యక్షుఁడు నేఁటినుండియును ఝాన్సీరాజ్యకార్యంబులన్
దానై చూచుచు రాణి కీఁదగిన భత్యంబున్ మ రింకెవ్వో యీ
లోనన్ నిర్ణయ మాచరింతుము సమాలోచించి శీఘ్రంబుగన్.

న్యాయముగాఁగఁ గోట విడినన్ సరి, వీడక యున్న మేము సే
నాయుతిగాఁగ వచ్చి ధర నాక్రమణంబును జేయఁగావలెన్,
మాయెడ మీకు మీయెడల మాకును గల్గిన పూర్వగారవ
వ్యాయతి సాధురీతి వ్యవహారము చేయుట మంచి దిర్వురన్.

అప్పుడు దత్తతయప్పుడె
చెప్పెను దానచటనుండి సేనాపతి, మీ
రప్పుడు విన్నది లేదు, మ
రప్పుడు మీరాజునుదిక్కు నడుగము మేముకా.

అనవసరంబుగాఁగఁ గలహంబులకుఁగా దిగు లేల యంచు మే
మును నపు డూరకుంటిమిని, భూపతి మా చెలికాఁడు తీరిపో
యెను, ధర కెల్లు రా జగునొ యెవ్వఁడొ, రాణికి వారిలీవికిం
దన దెడు గొప్పకుం దగినదాని భృతిగా మరి యిత్తు మెప్పుడుగా.

చానయొకర్తు భూభరణశక్తిని గలుట యెంచరానిదిగా
గూన యెవండొ దేహమున క్షోణిపునేత్తురు లేనివాఁడు రా
జ్యానికి నర్హతం గనుట యన్నది విన్నది కాదు మాధరా
స్థానములందు భూప్రజకు సౌఖ్యము కల్గద యట్లు చేసినగా.

ఒక్కయధికార మది లేకయునిక్కతక్క
దక్క సర్వభోగంబులు దర్పములును
రాణిగారికిఁ జెల్లు నిరంతరముగ
ప్రభువుమర్యాద లన్నియుఁ బరిథవముగ.

నిలచియుండి రాజప్రతినిధియు నపుడు
మొగుడుకొన్న యాజ్ఞాపత్రము వినిపించెఁ
దెగువమైఁ గోటలోని క్రిందియధికారి
రాణిగారికి శౌర్యసామ్రాజ్ఞి కట్లు.

రాణినేత్రంబు లను గంగరావిపూల
కంతలోఁ దెల్ల వారిన దాపువులకుఁ
జివరలందున హిమము తోఁచినది సుంత
తీర్చి హేమంతబుతు వరుదెంచినట్లు.

ప్రతిసమాధానమునకు ఫరంగి రాణి
మోమునందునఁ గాంచెను మోమునందు
రాణి గాంఢీర్యంచి పైదూఁకి రక్తనాళ
ములను బెకలింపఁ జను పులివలెను దోఁచె.

అంత రాణి యెదో ప్రసంగాంతరమున
నాఫరంగిని గని యిట్టు లనియె భార
తావనికి నెప్పు డయ్యె మీదే ఫరంగి
రాజ్య మేలుచునుండిన రాజు రాజు.

ఈలెక్కంబడి భారతావని యటం చే మున్న దాకాశపృ
థ్వీలోకంబులు మీవె సర్వమును మీదే యంచు నెచ్చోటనో
వీ లచ్చోటను బీట వెట్టికొని యూపి తెచ్చుటన్ లేదో నీ
వాలోకంబున నున్నచుట్టుకొని యిల్లె హెచ్చులున్ దగ్గులున్.

పోవుచునుండఁగాఁ గడచిపోవుచునుండును గాల మెప్పుడో
యీవిలయప్రవాహ మిది యెచ్చటో తక్కన నాఁగిపోవు నా
పోవుటలోన నిక్క మొకబొట్టయినన్ మరి నిల్వదే ఫరం
గీ! విలయప్రవర్తన ల వెప్పుడు నిట్టులనే ప్రవర్తిలున్.

ఒకవందయేండ్లు కా, దిం
కొక వంద, మరంతకంటె నుండదు, మీతా
తకుఁ దాతలు మున్ను హిర
ణ్యకశిపుముఖ్యులు గడించిరా! కాలంబున్.

ఇట ధర్మమ్ము నధర్మ మియ్యవియు రెండే యీయనంతత్వవి
స్ఫుటకాలమ్మునయందు నొక్కనిముసంబుంబట్టి మీవంటి లం
పటు లేతాదృగనేకదుష్టకృతి సామ్రాజ్యంబు సాధించు దు
ర్ఘటముల్ కార్యము లాచరించెదరు దౌరాత్మ్యంబు నిత్యంబుగన్.

ఈనేలంతయు మాది కా దనుట కిం దెవ్వాఁడు? చోరుండు కా
డేనిం జోరుఁడు నేఁడు కానియెడ రేపేన్ బద్ధుఁడున్ వధ్యుఁడో
నేనున్ నీవును నెట్లో వ్యక్తులము నళ్లే జాతులున్ గ్రూరమా
ర్గానన్ సత్పథమందు నేగుట యహో కాలంబు సాక్ష్యంబుగాన్.

అనిత్యమయిన సౌఖ్యమె
యీనేలఁ బురాణములుగ నెసలారు మహా
జ్ఞానస్థానములై యా
జ్ఞానము నీవంటితెలివి చాల దెఱుంగన్.

ఈకోట నేను వదలను
నా కోటఁ గలుగునేని నాకుఁ గలుగనీ!
నాకుం బ్రాణము లుండిన
దాఁకఁ బోరాడెద నది ధర్మము నాకున్.

పండఁగనయ్యె మీఁదయిన పాపము కొంతకుఁ గొంతగాఁగ మా
ర్తాండుని కాంతి పంకవసుధాస్థలమందునఁబోలె నేను మీ
గుండెలలోన క్రూరమగుఁ గ్రొల్పులివోలిక నిప్పులట్లు కూ
ర్చుండెద నీవు వ్రాసికొనుమోయి ఫరంగులమూఁకనేతకున్

అని వెడలిపోయె లక్ష్మియుఁ
గనుకని నొకకొంత తెలివిగాఁ డెలివగు నా
తనికి ఫరంగికి రాణివ
చనముల్ మనసున యథార్థసరణిం దోఁచెన్.

కోటలోని ఫరంగులు కోటనుండి
పురుగుకూడఁ దప్పించుకపోవరాదు
వారి మనదైన యీన్యవహార మెల్లఁ
బోరో పొందో యెదో తేలిపోవువఱకు.

భరముగ వంకదారికడ బంటుల గుండెలు తీయుజోదులన్
దిరముగ నిల్పి భద్రమగు తీరున నాలుగుదిక్కులందునన్
బురుజులపై ఫిరంగులను మోసినవానిని బార్లు చేసి సం
గరమున కంత సిద్ధమునుగాఁ బొనరించెను రాణి నేత్రియై.

పాతరలం దుంచఁబడిన విఘ్నేశ్వరు
కోసమో యెలుకలు కుద్దలించె
ఒకకన్ను గ్రుడ్డిదయ్యెను గాక మొండఁబో
సిన ధాన్యలక్ష్మి ముక్కున విదిర్చె
గందియు, జనుమును గాయ లెండిన లోని
గింజలు గలగల గిలకరించె
బచ్చిపసపుదుంప బాలెంతరాలు నాఁ
బసిమితో నందమ్ము బాదరించె

మింట మంచున కిలమీఁద మెట్టపంట
పసిమి కొదుగక తప్పకవచ్చెఁగాని
గండుటెండలు పట్టఁ బగ్గాలు గలవె
మహితహేమంతమెల్ల గ్రీష్మముగఁ జేయ.

---

# ఝాన్సీరాణి

## షష్ఠాశ్వాసము

౧

ఏసూత్రంబున రాణి పెద్దపులి యయ్యెన్ హూణసంవ్యాప్తమై
యాసూత్రంబునయందు సింహనిచయం బాసేతుశీతాచల
ఝాన్సి సృష్టింపఁబడెన్ సమస్తమృగరాజశ్రేష్ఠుఁడై యొప్పె నా
నాసాహే బొకరుండు నావిలయసంధ్యాకాలకంఠాకృతిన్.

ఆసూత్రముక్రిందికె నా
నాసాహెబుకూడ వచ్చినాఁ డావీరుం
డాసూత్రమె హూణుల గ్రీ
వాసంయోజనపటిష్ఠబంధము చేసెన్.

ఆయన కుమ్మ్రవెట్టె సకలావనియందున లోన లోన నా
గ్నాయి విభుండు పుంజుకొనఁగా నొకరోజున సర్వదేశసం
స్థాయతఁ బండి విచ్చికొని భగ్గున మండి దహింప భారత
ఝాన్సియుతవహ్ని ఫరంగి యవసం బదియు న్నశియించు రూపునన్.

ఒకపిడక యకాలంబున
నొకచోటను విరిసి కుమ్మునకిఁ దెలియఁగా
నకటా! కలిపురుషున కది
యొకయనుకూలమ్మకాల మొప్పిన గుఱుతై.

నెలతక్కువబి డ్డైనది
జ్వలియించి విప్లవాగ్ని జ్వలియించిన ని
ప్పుల విడిలు మంటలోన నె
మలమల మాడెను ఫరంగి మత్తశలభముల్.

ఆక్రమ్మంతటి భద్రి
మ్రాకమ్మును బెట్టినతఁడు నతఁడని యెఱుగం
గాకయ నానాసాహెబు
నాకాన్పూరున సహాయ మడిగిరి హూణుల్.

హూణసృగాలముల్ కడుపు లుబ్బ పదంబులు బిఱ్ఱసాచి ని
ద్రాణము లయ్యె మాఱట కిరాతుఁడు నుచ్చులత్రాళ్ళు లాగినన్
బ్రాణుల సాధుశీలురయి పాపములం బొనరింప వ్యాఘ్రము
ల్గానయి తప్పివచ్చిన సృగాలము లౌదురు నీచభావులై.

అపరిణతమ్ము విప్లవమహాగ్నియు లంకెగ నందుకోక అం
పపుఁబొడితోడివౌ చెదరు మంటలుగానయి యారిపోవుచో
నిపుణుఁడు నానసాహెబును నెక్కొనఁ జేయుచుఁ గూర్చి కూర్చి నే
రుపుమెయి నెంత చేసినను ద్రోహపు నల్లమొయిళ్ళు మూగెడున్.

తదనంతరభావితమై
న దేశముల జన మేకనాళము సృష్టిన్
మొదలి యిట బ్రహ్మ యుంచిన
పదివేలగు విత్తనముల ప్రజలై యున్కిన్.

విడివిడి లక్షణాలుగల వీఱిడిమూఁక లిటం జనించుచున్
విడివిడియైన జాతులుగఁ బృథ్విని నేర్పడి రచ్చటచ్చటన్
గడువడి నన్యదేశములఁ గల్గినవారలు జాతులైరి యీ
పుడమిని ధర్మ మొక్కఁడు ప్రభూతమ యైక్యకృదేకభావమై
అమరన్ ధర్మము చిచ్చువంటిత తదభ్యాసంబునన్ దూరదూ
రముగాఁ బోదురు మానవావళి యధర్మంబున్ శరీరంబు నై
జముగాఁ జొచ్చు నధర్మసంచయమునం జానొప్పు నొక్కండు ధ
ర్మముగా నేగెడు జాతి యైక్యమున మర్మం బిద్ది లోకంబునన్.

ఆధర్మంబును నెన్నగిల్లిన కలివ్యాపారవేళన్ సవి
త్రీధర్మాభిరిరంస కల్గిన ధరిత్రిన్ జాతితాలక్షణ
వ్యాఘాతిం జన భారతక్షితిని నైక్యం బుండ దాహేతువై
సాధింపంబడు నీధరిత్రియుఁ బరస్మాలోకధర్మంబుచే

పగగం దోలను గూఁడుగుడ్డలకు లోపం బంచు లేకుండ ని
ర్ధర నిర్మాణము చేసి సంఘపువ్యవస్థన్ బైన ధర్మంబు ని
ల్పిరి యీభారతధాత్రి నాద్వయము లోపింపించి తత్సాధనా
దరబుద్ధిన్ నిలుపంగ ధర్మము వ్యవస్థాదూరమై తోఁచెడున్.

బ్రదుకు మొదలియవసరము లన్నవస్త్రమ్ము
లందఱకును నవ్వి యమరియున్న
యవనియందుఁ బెద్దయాసలు కల్పించి
యని హరించి దాసులట్లు చేసి.

ఒక యెవఁడైన దానిఁ బునరుద్ధరణం బొనరింప నెంచువా
నికి నెదురొడ్డి యీజనము నిల్చిన నిల్కడలేని మోహవా
రికిని బ్రవాహభావ మురరీకృతిచేసి సనాతనంబు ధ
ర్మకళను స్వస్తి చెప్పెదు నమాయకసేనలచేత వ్యర్థమై.

నానాసాహెబుమార్గము
నానామార్గముల నేగినను ధర్మం బ
స్తోకము తత్కాలాధ
ర్మాకృతి హరియింపకుండునా కృత మగుచున్.

అనుకొనిన రోజు రాలే
దనుకొన్నది ముందె తెలిసె నరిసేనకు వా
రును జాగ్రత్తపడిరి మరి
కొనకొని యీధర్మసేనకున్ సూటి చెడెన్.

ఆగుటా తొలిపదకంబు ననుసరించి,
తూగుటా ముందునకు రెండు తోఁచవయ్యె
కొంద రిట్లుఁ జేయంగఁ గొంద రట్లు
భిన్నదేశంబుల ఫలంబు భిన్నమయ్యె.

అది సుశిక్షితమై వ్యవహార మెల్ల
నద్ది బహిరంగముగఁ జేయునట్టి సేన
యిది యశిక్షితమై చేయ నెద్ది తలఁచె
నది రహస్యంబుగాఁ జేయ నెంచు సేన.

ఇది తూరు పద్ది పడమఁగ
కదిసిన మలుసంజ దైత్యఘట రిపుసైన్యం
బు దివాకాలము కడ చని
నది మిన్నది మీఁదఁ గదలినది రక్తంబున్.

పలుచోట్ల ఫరంగుల వరు
సలు తీరిచి మెడలు నరకి చంపిరి మును వా
రలు చేసిన ఘోరంబులు
తలఁచి తలఁచి యాపరానిదగు కోపమునన్.

దైత్యులకు దేవతలకు భేదంబు నిరియ
దేవతాభావ మెపుడు దైతేయజాతి
పొందదను దైత్యభావంబు పొందు దితిజ
వితతి ప్రతీకారకరణదుర్వేళయందు.

తెలిసె ఫరంగిజాతికిని దెల్లముగాఁగను ద్రొ భారతీ
యులు నది యెంత సాధువులొ యుజ్జ్వలమైన స్వధర్మనాశముం
గలిగెను నన్న వేళ రిపుకంఠవిదారణకార్యచండమూ
ర్తులు రహస్యచారణమతుల్ మరియంత యటంచుగుండెలన్.

చెడుగులు సన్న్యాసులను జేసిన చెప్పఁగరానియట్టి యా
గడములు నిందు చేయుటలు గాదిది యెప్పటికైనఁ దప్పదే
మెడపయిఁ గత్తి యీభరతమేదినిలోని జనం బమాయకుల్
గడుసరు లుత్తమోత్తములు గండరగండలు మించివచ్చినన్.

ఐనను గాలమ్ము పరా
ధీనంబై యెదురు నడచె ధృతిమంతునకున్
నానాసాహెబు హిమగిరి
లోనం జొరఁబడియె మెఱుపులోపలి మెఱుపై.

౨

తనువుం దాల్చిన ధర్మదేవత తనంతన్ నానసాహేబు నుం
చినదా కుమ్మున లోనిభాగమగు ఝాన్సీకూడఁ దానంతఁబె
ల్చన మంటల్ దెసలందు విప్లవమహాజ్వాలాప్రచండంబుగాఁ
గనదాశాతరుణీమణీకుచతటీకాశ్మీరపంకంబునాన్.

లలితాకారుఁడు నీతివేత్త యజిముల్లాఖానుఁడున్ మంత్రియై
నలువౌ చారణదక్షుఁడై సకలసేనన్ దాంతియాటోపి సం
ధిలు ధాత్రీపతి నానసాహెబయి ఝాన్సీలక్ష్మి సామంత భూ
ములు చూడంగ స్వతంత్రతాచటుల మంభోరాశి యుప్పొంగెడున్.

అల పూర్వంబగు నెన్నొ వేళలను బ్రిటిష్మన రభూపాలమా
శిలసద్గూఢరహస్యసౌధముల వల్లీవ్యూహనిర్మాణద
క్షులు నీనల్వురు నీతిఖండితవిపక్షుల్ పెల్లు కూర్పించి హా
ణుంకుం గుంపటి తెచ్చిపెట్టిరి శిఖానూత్నాగ్ని సాప్రుష్టముల్.

ఎటుఁగ్రై కోటను వీడిపొమ్మనిననాఁడే రుద్రకాళింబలెన్
విలయాభీలమహాగ్నిగోళముగ నావిర్భూతయై తా ఘనం
గుఁ గచ్చోటనె కట్టియుండెనిదియో గోడలు నిర్జితమై
పొలుచున్వేళయుఁగానివేళ యగుటన్ ముగ్ధాత్మయై యుండెనీన్.

అచ్చట నిచ్చట నంచును
బెచ్చుపెరిగి వచ్చుచున్న విప్లవవార్తల్
విచ్చిన ఝాన్సీపురమునఁ
జిచ్చు విజృంభించెఁ బరవశీకృత మగుచున్.

అల ఘరంగీలగూడెము నాక్రమించి
వారి విగతాయుధులఁ జేసి వారి నెల్ల
శృంఖలాబద్ధులను జేసి చేర్చి యొకటి
వారిని విచారణము చేసినారు ప్రజలు.

తనవంక విస్మయంబుగఁ జూచె నని యెంచి
యొకఁ డొక్క భారతీయుని వధించె
క్రొత్తుపాకి మ్రోఁగునో లేదో యని చూడ
నొకఁ డొక్క భారతీయుని వధించె
నొక్కండు భారతీయుని జంపె దారిలో
నున్న కుక్కను గాలఁ దన్నినట్లు
నొక్కండు భారతీయునిఁ జంపె భారతీ
యునియందుఁ దేలికతనము చూప
అదివఱకుఁ జంపియెఱుఁగనియతఁ డొకండు
చంపు టె ట్లుండునో చూడఁ జంపె నొకని
వార లొక్కొక్కఁడును యమభటులు రాణి
రాజ్యకారంబులం జూడరాకమున్న.

హిందువు లందఱు పందులం చనె నొక్క
వనిత యంగడిలోనఁ గొనఁగఁబోయి
కొని డబ్బొసంగక చనుచు డబ్బడిగిన
మొగముపై నుమిసెను ముగుద యొకతె
తనముందు నిలుచుండె నని వింత చూచుచు
సిగిరెట్టుతోఁ గాల్చెఁ జెలువ యొకని
తనకంటె ముందు తూగి నడచుఁ బాగ రని
ముగుద బెత్తంబున మోదె నొకని

గౌను సగముఱొమ్ము కనిపింపఁగాఁ దాల్చి
చూచె నంచు నొక్కసుదతి యొకనిఁ
జేతిబెత్తమునను జెండె నాతనిమోము
వాచిపోవఁ దాట లేచిపోవ.

ఈకుఱ్ఱకుంక లందఱు
వే కనుచూపులనె పరిభవింతురు మనలన్
బైకొనిన దర్పరేఖను
జేకొను తలిదండ్రు లిచ్చు చెడుపెంపకమై.

చెడుఫలంగులు మనచేతఁ జిక్కినపుడు
మృదులభావన నదలిపెట్టుదుము మనము
నదియు వారికి లోకువైనది మరేమి
వీరు చేయునెలే రన్న నీరసమున.

అపకారికి నుపకారము
నెప మెన్నక చేయు టెంతో నేర్పరితన మ
న్నపలుకు మనుష్యవిషయము
విపరీతమనుష్యపశువువిషయము కాదే.

వాఁడొకండు చావ వందమంది గతింప
వలయు నంట యిచట భరతజాతి,
సజ్జనాళి బ్రదికి చచ్చి భారము లేదు,
దైత్యుఁ డొక్కఁడైన ధరకు బరువె.

ఒక్కచంపుటయే శిక్ష యుర్వియందు
నెంతక్రూరనకైన ని దేమి త్రాసు
దొంగతక్కెడ చేసిరి తొలుతనుండి
దైత్యు లనియెడి దొంగవర్తకులగుంపు.

మనలోన లేని క్రూరత
యును నప్పుఁ దెచ్చికొని దురుద్యోగుల వీ
రిని జితవిధ పౌనఃపుం
గనువలయును దీనిభయము గడలుకొనంగన్.

ఇది తుదివేళ వీరికిని నిద్దిఫలంగుల కొక్కవేళ గా
దిది యొకనైన వీరిఁ గదియించి శిరస్సులు జానువుల్ ప్రచం
డదమననీతి చూపిన నెడందల వీరికి భావినైన లో
నదరు జనించు లేనియెడ నాఁడిన యాటగ నయ్యె వీరికిన్.

పామునకుఁ బాలు పోసినపగిది వీరి
నల్ల మనపూర్వరాజులు నాదరించి
వరకస్థానముల నిచ్చి బ్రతుకనిచ్చి
రని కృతజ్ఞతమైన లేనట్టివారు.

పరభాషాపరనుతముల
పరసంస్కృతియందు మోహపడుటయె చాలున్
దఱిని స్వజాతికి ద్రోహము
విరచించుట పైన వేయివిధములఁ జాలున్.

ప్రౌఢశౌర్యము లక్ష్మితండ్రియగు మోరోపంతు తంబేయు ధీ
ధావల్లక్ష్మణరావు మంత్రియు మరిన్ ఠాకూర్లు సర్దార్లు వీ
రావేశంబున నిశ్చయించి రది యేమైనన్ సరే యుద్ధమే
చావో గెల్పొ మహేశ్వరుం డెఱుఁగు దుశ్చారిత్రమా జాతితో.

తులువల్ కాలము మారుచుండు ననుచున్ దుర్బుద్ధి మీసాలబు
గ్గలు మార్జాలవిలోచనంబులు ధరాకాంతుల్ మహాధర్మము
జ్జ్వలమున్ జంపెద రంచు రాణి రణదీక్షాచండతావ్యగ్రని
శ్చలనేత్రంబుల వైరిగుండెలు చలించన్ భేరి వేయించినన్.

ఘనగర్జ మనెడి పేరిటి
యవితరగర్జాప్రచండమయిన ఫిరంగి
నినదంబులకు ఫరంగీ
వనదంబుల కుటిలగర్జ వ్యర్థం బాయెన్.

రవరవలా ఫరంగుల ఫిరంగులగుండ్లకు బెత్తఁబాడ గో
డ విన్మృతమృత్యుదంష్ట్రిక కడంకను గోట ఫిరంగిచేత శా
త్రవబహుళాసువుల్ నుగుడ రాణి ఫిరంగియు మ్రోగకుండఁగా
ను వదలి ముట్టడించిన జనుల్ బ్రదుకంగను రానియట్టిదై.

రెన్నాళ్ళదగు ప్రయత్నము
న నిష్ఫలము ఘనగర్జ నదపరుపఁ గో
ట న్నెగులు పుట్టి వీరులు
కన్నుల నెత్తురులు క్రమ్మఁగా నిలుచున్నన్.

అరియు దక్షిణంపు బురుజుపైఁగల ఫిరం
గులను మూఁకపరుపఁ గోటలోని
వారు తల్లడిల్లిరి పడమటిబురుజుపై
గల గులాబు ఘౌసుఖాను డపుడు.

## సప్తమాశ్వాసము

తనఫిరంగి త్రిప్పి దక్షిణముఖముగా
నలఫరంగిసేనయందుఁ గలుగు
నుత్తముని వధించె నుగ్రుఁడౌచు ఫిరంగి
పేల్చువాని రిపులు భీతి చెంద.

ఎనిమిదినాళ్ళు లీపగిది నింధన మౌచు ఫిరంగివహ్నికిన్
మనములయందు వేరయిన మార్గము తోఁపక కోటలోపలం
జనములు త్రాగు నీరుగల శంకరదుర్గము నిప్పులోన ముం
చిన నట లోనిసైనికులు జీవనమందునఁ గల్గు కష్టమై.

బయట సమస్తమౌ వెసులుబాటులు గల్గిన సేన యెంతొ ని
ర్భయముగ నుండ నచ్చటికి వచ్చెను దాంతియటోపి పెద్ద సై
న్యయుతముగాఁగ వచ్చె నని యందఱు సంతసమంద శిక్షలే
కయ యది యంతసేన కలగాపులగం బయి పారిపోవఁగా.

వట్టి స్వాతంత్ర్యవాంఛమై వచ్చినట్టి
యాయశిక్షితజనములు నందినంత
నఱకు బాకులతోడఁ గ్రుమ్మిరి ఫిరంగి
బారులం జేసియుం జంపినారు రిపులు.

ఈమహాఘోరమును జూచి హృదయమందు
భగ్గు మని మండినది లక్ష్మీబాయి యంతఁ
గోటతలుపులు తెఱపించి కూడనున్న
వేయిసైన్యమ్ముతో శత్రువీథిఁ జొచ్చె.

ఎచట ఫరంగిసేన కల దేఁచినకిన్కను గ్రోల్చు వ్యాఘ్రమై
యచటికి దూఁకి శత్రువినయంబు గళంబులయందు మట్టగిం
చుచుఁ గరవాలధార ఎదఁ జొన్పుచు బల్లెపుఁబోటులన్ విద
ల్చుచును ఫరంగిమూఁక యమలోకపుద్వారములందు జొన్పుచ

కరవాలమునఁ బట్టి కంఠముల్ తరుగుచో
నెడనీటిబొండంబు తెగచినట్లు
బల్లెమ్ములతో గుండె పగిలించినప్పుడు
ధృతి గట్టుకడు గడ్డ తీసినట్లు

గుఱ్ఱమున్ దూఁకించి కూలించినప్పుడు
నడవి చెట్లను బడనడచినట్లు
తలపైన డాలుతోఁ దాడించినప్పుడు
తుప్పన్ త్రివ్వి పారతో సర్దినట్లు
కెలకులకుఁ జిత్రముగను లంఘించునప్పుడు
తూఁగునడకల నేతాము త్రొక్కినట్లు
విజయలక్ష్మివిధంబున వెలిఁగె రాణి
పంటలక్ష్మివిధంబున బ్రిబలె రాణి.

పారిపోయెడివారి వెన్బడి వధించి
నట్టిశూరులు మీఁదికి నరుగుదెంచి
నట్టి లక్ష్మికి భీతులై యనద లగుచు
పారిపోయిరి వెస దూరదూరములకు.

రిపుసేనలోన బహుదూ
రఁపు నేలను జొచ్చి యలఫరంగుల బహుని
స్త్రపుల గుదులు గుదులుగఁ జం
పి పలాయితులన్ బొనర్చి వెనుకకుఁ దిరిగెన్.

చాలదూరమ్ము వచ్చితి శత్రుమధ్య
మున కటంచును వెనుకకుఁ జనియె రాణి
దాఁగికొన్న ఫరంగులు మూఁగికొంచు
మఱలఁ గోటను ముట్టడింపనుఁ గడంగి.

వెస ఫిరంగుల మూకీభవింపఁ జేసి
దక్షిణంబున బురుజు శాత్రవచయంబు
లగ్గలెత్తి నానావిధాలన్ బ్రవేశ
మాచరించిరి దుర్గంబునందు నందు.

కూర్కదాబక్షును గులాముఘోషు ఖాను
ద్వారరక్షకుఁడు ఫిరంగిబారు వేత్త
లల్ల. సంకులసమరంబులందు మఱియుఁ
గోటపై నూఁగెడున్ ఫరంగుల పతాక.

దీప్తములు 'హర హర మహాదేవ' యన్న
సింహనాదమ్ము లన్నియు శీర్ణ మయ్యె
మ్లేచ్ఛభాషానినాదముల్ మిన్ను ముట్టె
నంధతమసంబు దుర్గంబు నావరించె.

౨

నేను ఫిరంగిమందుకు గడి నిప్పును బెట్టి మహాగ్ని మ్రగ్గదన్
గాని ఫరంగిచేతఁ బడి గౌరవహీనపుఁ జావు చావ నం
చూనిన రాణిఁ గన్గొని మహోన్నతుఁడౌ సరదా రొకండు త
ల్లీ! నెఱిఁ గోట వీడి చను వే రిపుసైన్యము చీల్చి రెండుగా.

నీ కొక్క-ఖడ్గవిద్యయె
కాదుగ దమ్మా! చమూనికాయము సమపం
గాఁ దగు నీమేధయు పీ
ష్వాదగు సేవకును నేతృభావము గనుతన్.

ఈకృత్యంబున నానసాహెబు ధరిత్రీశుండు పీష్వా మరిం
గానున్నన్ మరి యన్నయుం గురువునుం గానున్నచో నీవు క
న్నానైక భారతసేవయే నడపియున్నన్ జౌకు జౌకౌ ఫరం
గీకాంతానము నంటకట్టులకుఁ గా కేమౌనొ యీనాఁటికిన్.

అని దైన్యంబును గన్నులన్ ముసరుగానా పార్థనావావధూ
కుని వృద్ధున్ సరదారు గైకొనుమ మేల్గుఱ్ఱంబుపై నెక్కి తా
నును దామోదరరావు పూరుషుఁడుగాదుం దాను నేకొద్దినుం
దినొ వెంటన్ బరివారముం గొని చనెన్ దివ్యగ్రితాపమూర్తియై.

ఒక్కదంతావళం బెక్కెంచి మణికదం
బకములు లక్షణవాహనీయు
తనయుంగరక్షకై చనఁ బదాగ్నంది సై
నికులును మందరాఖ్యయును దాసి

దాసియు ఖడ్గవిద్యాధురంధర యశ్వ
శిక్షావిధాన మక్షీణబుద్ధి
యొకవందమంది సైనికు లర్ధరాత్రిమ్ము
నన్ గోట విడి యేగినదియు రాణి
వారు తేహరీపతిపరివార మంచు
సాఁగి యొక రెండుచోట్ల నుపాయరచనము
చేసి తప్పించుకొని దారిఁ జేరి కల్పి*
కభిముఖము గాఁగ జనుచుండినట్టి వేళ.

రాణియుఁ దాఁటి యేగెను దురాగమనంబగు దంతిఁ గోడఁ గం
ఖాణము దూఁగిపోవ నటఁ గన్పడెఁ దూర్పునఁ గుమ్మరావమై
కోణము మూతిలేనిదగు కుంభము నెత్తినయట్లు వాముదృ
క్కోణమునందు నంత రవిఘోటక మాననసీమ రంజిలన్.

చీఁకటి ముసుఁగుం ద్రోచెన్
రేకడ చన్నను వియచ్ఛరీపాధర ఝాం
న్సీకిఁ బది యోజనంబులు
సాకెన్ నెలవార బాయి సాహెబు వీఁకన్,

జాముంబొద్దది యెక్కినప్పటికిఁ బెల్పిం జేరి భాండీరక
గ్రామం బచ్చట రాజభక్తికిఁ బతాకాభూతుఁడైనట్టి తి
ద్గ్రామగ్రామణి యింటఁ బొందిన సమర్చాప్రీతయై రాణి యం
దేమో తిండియుఁ దింటయేఁ తడవుగా నేగెన్ బథంబందునన్.

రాణి విడిపోయెఁ దాను దుర్గంబునుండి
యని తెలిసి వెంబడింపఁగా నంపినారు
వందమంది యాశ్వికులతో బదశౌర్య
'బౌకర' ప్పేరుగల తెల్లవాని నొకని.

వాఁడును వేగవేగ గురువల్గనచాతురి వెంబడింపఁగాఁ
గూడిన వాలు పొద్దునకుఁ గూడిరి వారును వీరు బౌకరున్
వాఁడిమగండు ముందునకు వచ్చిన రాణి విదిల్చి గుఱ్ఱమున్
వాఁడును నేలఁగూలఁ దలనంపుగ ఖడ్గపుఁ గేళి చూపినన్.

---

* ఒక ఊరిపేరు.

ఆక త్రివిద్య నెఱుఁగక
బాకరు పడినట్టివాఁడు పడినట్లే యై
మూఁకలు రెండును గలిసిన
దాఁకన్ దనమూఁక విఱిగి తలఁగినదాఁకన్.

బాకరు మూర్ఛ తేఱి కొని బంధురతీవ్రవిచిత్రఖడ్గకే
ళీకృతి పూర్వ మెందుఁ గనలే దట రాణియు వచ్చి యెట్లు తన్
దాఁకెను గుఱ్ఱమున్ మఱియుఁ దానును జుట్టలుచుట్టుకొంచు నో
హూ! కుదిలింపుగాఁగఁ బడిరో మన సాడనియట్టి పాటుగా.

నిన్నటి సాయంకాలము
కన్నారఁగఁ గాంచె రాణి కరవాలకళా
సన్నద్ధమృత్యుదంష్ట్రా
సాన్నిధ్య మ్మిద్ది దానిచందము మిగిలెన్.

ఇది పులియో సింహంబో
మదిత యగుట కాదు నిన్న మోచిన యుద్ధం
బది రేయెల్లఁ బ్రయాణము
మదిఁ నోటయుఁ బోయినట్టి మహితభరంబున్.

ఇనుపకవచంబుతో పాటు తనకు వీపు
నందు వ్రేలాడు యువరాజు నాకడచిన
కొన్ని దినములు ధర సమాసన్నయుద్ధ
కార్యసన్నాహముల నిద్రకాని లేమి.

మఱియును వెన్నాడఁగ నెద
యఱుమంగా లేక మిగిలినట్టిర భటులన్
గఱపించుక తిరిగి చనియె
వెఱ పించుక లేని వానివిధమున నతఁడున్.

ఆయర్ధరాత్రమున కే
శ్రీయుతమతి లక్ష్మీబాయి చేరెను గల్పిన్
శ్రీయుతబుద్ధియునగు పీ
ష్వాయును దా లక్ష్మిఁ గాంచి సంతస మందెన్.

వారల్ పేరును బోల్చి చెప్పికొని పేష్వావంశపువారసుగా
వీరుల్ పోయినత్రోవఁ బోవుటకు నువ్విళ్ళూరి నిట్టూర్చి పే
ష్వారాజ్యంబున నున్నసైన్యమును సర్వంబుల్ మహాబుద్ధి ఝాం
సీరాజ్ఞీమణి కప్పగించె సహసామీలద్దృశాపద్మయై.

ఆపగిదిన్ హతంబయిన యంతటిసేనను జూచి తాంతియా
టోపియు ఝాన్సిరాణికిఁ గడున్ దనసాయము లేక యేమియున్
దోఁపకవచ్చెఁ గల్పి కిటఁ దోఁకొని యిచ్చటిసైన్యమున్ సుశి
క్షాపటువుం బొనర్చి చనఁగా రిపుసైన్యము సంహరింపఁగా.

పేరుకుమాత్రి సైన్య మది భీకరసంగరశిక్షణంబు లే
దారభమాణధైర్యగుణ మున్నది నిల్వను గొంకికొంట లే
దేరికి శిక్ష యిచ్చుటకు నించుకసైనను వేళ లేదు నా
రారఁ బ్రవాహ మౌచును ఫరంగితరంగము లేగుదెంచుచో.

కడుకొని మున్ను వేయు పదకంబున సేనయు శిక్ష లేవు నె
క్కుడనగువారి నక్కడనె కంఠములందున నుల్మి గుట్టుచ
ప్పు డనుచుఁగాక యుండఁ బొలిపుచ్చఁగఁ జేసిన నేత నేఁ డదిం
జెడినఁ జనూసమూహాపరిశీలన సాధ్యము కాకపోయెడిన్.

తాంతియాటోపియును లక్ష్మి ధైర్య మూని
యఖిలసైనికులన్ సమాయత్తపఱచి
యాఱునెలల శిక్షణము నాఱుగడియ
లందు నేర్పెడు మార్గమ్ము ననుసరించి.

పానీయ మంచుఁ జల్ల లటంచు వినియోగ
పరచుకొందురు జనుల్ వట్టివేళ్ళు
తాపశాంతు లని శీతలము లంచును దాని
సక్తులొందురు జనుల్ చల్లనీళ్ళు
చలువ లటంచు వాసన లంచుఁ బైపూఁత
గ్రమ్ముకొందురు జనుల్ గందవొళ్ళు
దాహ మటంచు శైత్యంబు లటంచు నా

వచ్చిన వసంతే మది గ్రీష్మమై భవమ్మై
ప్రాణబాధానహమ్మను భ్రాంతిదమ్మై
వర్ధ మెఱుఁగని జనము తాపాపనోద
కృతప్రయత్నమ్మై తప్తశరీర మయ్యె.

---

# ఝాన్సీరాణి

## అష్టమాశ్వాసము

౧

తాను సుశిక్షితమై చను
సేనాసముదయముతోడఁ జేరెను హ్యూరోజ్
బూనికఁ గల్పిని విప్లవ
సేనాసముదయము లందుఁ జేరిన వంచున్.

ఇతరమహీపతుల్సయిత మేఁగి స్వకీయచమూసమేతులై
జతపడి రందు శిక్షణము చాలనియట్టివి యాజ్ఞ యొక్కప
ద్ధతి యెఱుఁగంగనట్టివగు దండులతో బహునాయకంబు నా
యతుకులమారిబొంత యగునట్టి చమూనివహంబు గాంచుచున్.

గెలుచు టెట్టు లైన నోటమి గలుగు నన్నఁ
జిత్రవధ శేకయుండఁ దీర్చినవిధాన
నెట్టు లుపసంహరించుకో నెసఁగు నద్ది
నేర్పె రాణియు నది చమూనివహమునకు.

మిడియెండలో ఫరంగులు
తడఁబడుదురు నిలువ యుద్ధధాత్రి నటంచున్
మిడియెండలోనఁ బోరే
ర్పడసాఁగిరి సర్వవిప్లవచమూవితతుల్.

నేర్చి ఫరంగులుఁ వెనుక నిల్పిరి భారతదేశసైన్యముఁ
మార్చిరి ముందు యుద్ధము సమానముగా నడచెఁ మరంతలో
నర్చిరుదగ్రమై వెడలినట్టి శతఘ్నులముందు నిల్వలే
కార్చిరి రాణిపక్షమునయందలి సేనలు మంట యెక్కువై.

రాణి శిక్షించినవిధాన రాజితంపు
ఫణితి నుపసంహృతిం బరాబరులుగాఁగ
వెనుక కేఁగిరి సైన్యంబు కని ఫరంగు
లబ్రమును బొంది శిక్షణ మభినుతింప

తలక్రిందును జేసెద నని
తెలచితి నన్నిందు దించితివి తుది విఱిగెఁ
బలము వెనుదిరిగ నిట్లని
పలికిన పీష్వాకు రాజసభ రాణి యనెఁ.

ఉత్సవవిగ్రహంబు లివి యుద్ధము నేర్చిన సేన కాద యా
పత్సమయంబులఁ నిలువఁబట్టిన చిక్కన లేదు యుద్ధసం
ధిత్సవు కాదు వాజ్ఞపయు నిచ్చెడు నేరుపు లేద యెంతయో
మత్సరబుద్ధి యేకనుతిమాలిన వ్యర్థపుమక్కళింపులుఁ.

ఒక్కసారి నే చెప్పిన యొడుపు నేర్చి
యిట్టు లుపసంహరింపఁగా నెఱిఁగెనేని
పట్టుమని యొక్క నెల శిక్ష పట్టెనేని
తుక్కుదూఁగ రగు ఫరంగి తుక్కుమూఁక.

వారిది నేర్పు నల్ల మనవారిది కూర్పు మరింకఁ గొందఱుఁ
ధారుణినాథు లీయులుచదారిని బట్టరయేని యీధరి
తీరము ధర్మముఁ దెలిపి తెల్లనకావుట యేల సైన్యశి
క్షారతి నొప్పఁగా వ్యవధి చాలదు చాలదు వేళ యిచ్చుటఁ.

విశ్వాధారము కాల మేసమయ మావిర్భూత మౌఁ దక్కళా
శశ్వల్లక్షణ మానహిల్లు ఘటనాసర్వస్వమందుఁ దురు
గ్రశ్వేతాస్యుల కేది యేది హాసఁగఁ గాలంబె కల్పించెఁ గా
దా శ్వభ్రింబులఁ బూడ్చి పెట్టెదముగా మా! వారి నీపాటికిఁ.

అరమర లేక యెల్లయెడలందున మూసిన కుమ్ములు మున్నుగాఁ
దెరుపుడు పడ్డ దీవెడదదేశపు జాతికి బుద్ధిలోపలన్
దిరుగుడు పుట్టె నేఁటికిని దీసినఁ గోటికి లాగునట్లుగాఁ
బరమతభాషలం బ్రియము వడ్డని కోల్కొను టంచు నుండునే?

కొనకొని వేళ నుంత యనుకూలముగాఁగను సాఁగుచున్కి లే
దనుటకు వేఱ కావలెనె సాక్ష్యము నాదగుకోటచుట్టు నా
రనిచితి సోదెలోనికి ఫరంగులు రా రనునట్లు పెట్టితిన్
మన తెహరాయు, సింధియయు మన్నను బోసిరి యారునట్లుగన్.

అటు నిటు చాన్రు తప్ప దన నాహవముం బొనరించు సేన య
క్కట వెనుచాన్రు నిశ్చయముగా మునుచా వది సందియంబుగాఁ
బటుతరమైన యాజ్ఞకును బట్టనిసేన ఫిరంగి చూచి త్రో
క్కటపడి నిల్వఁ ద్రొక్కికొని కయ్యము చేసెడిపట్టుఁ గల్గునే?

ఇది యీకయ్యమి దేల యన్న నట నేనే ముందుకొ ట్టగ్గి పె
ట్టి దళజీవముగాఁగఁ జత్తు ననుకొంటింగాని యాముందు నా
యిది సేనాపటుచారణా త్తకళ యొందేఁ బందునో పోయి చూ
చెదనం చిచ్చటి కేఁగుదెంచితిని మీసేనల్ మ రిట్లున్నవిన్.

కాదని యుప్డు మానుటయుఁ గాదన మానుట యెంతో మాననుం
గా దను టంతె ఝూన్ని తనుకైవసమైన యనంతరంబునన్
బాదలిమూఁక యాపటచు పాటు ల వెట్టివి పూర్వ మెప్పుడో
నాదనుసా పౌసర్చె ననిన న్వినినట్టివి యిందు న ట్లగున్.

ఇచట స్వరాజ్యవాంఛ గల రెండటో యుందఱు నంత కెక్కువై
యిచట ఫరంగిజాతి కొలువే మతమే పటి వారిబాసయే
యిచటను నిప్పు డెప్పుడును నెక్కువయే యని యెంచు బుద్ధిను
న్నిచయము గల్గ నీకలి గణింపక తప్పద నీచకాలమున్.

కయ్యము చేసి చత్తు మనఁగా నది వేఱగు మాట యాడినం
గయ్యమునందు శత్రువులు కత్తులఁ గ్రుమ్మట తప్పదామె నే
కయ్యము చేయకే పురుషకారము మాలినఁ బ్రాలుమాలినన్
దయ్యము వెక్కిరించును ద్విధా వసుధారసహీనజీవులన్.

ఈమహి భారతీయులము నెందుకుమాలిన గడ్డిపోచ లై
నా మీట నిష్ప్రయోజనమనంబునఁ జేసిన సాహసంబు నా
రీ మలినాత్ములందునను దెచ్చును గౌరవభావ మిందు నీ
భూమిని నీదుజాతియును బొందఁగ గౌరవ మిట్లు చేయనో.

నాఝాన్సీధరణీతలేశ్వరుని కాంతాభావ మాదిన్ ధరి
త్రిజానిన్ మది నీరి కట్టనెనురై తీర్పంగ నెల్లప్డు నే
నీజాతిన్ దృణ మట్లు చూడ మదిలో నీర్ష్యాళువై యుండు నే
దో జాడన్ మరిఁ జేతఁ జిక్కుటకునై యూహించునే నెప్పుడున్.

అల్ల హిమవత్కుమారి కృపాంబు లూరి
యెంచి తా నెంతమంది నందించు నాకు
చేతికిని నంతమంది జిద్రుపలు చిద్రు
పలుగఁ జేసెద వారిపాపము ఫలింప.

మరియు స్వతంత్రభావమహామక్రతు వియ్యాది యీమహాగ్నిలో
నరికినవాఁడు దీన మరియున్ హుత మాటయె వెన్క కేఁగుటన్
సరణియె లేద యింతుఁ బడి చచ్చిన దుఃఖము తప్పిపోవు న
బ్బురమును లేద కాలమయపూరుషపౌరుషవహ్ని వేదికన్.

అనుచు ఝాన్సీమహారాణి యనిన సభయు
దిగ్గనన్ "హర! హర! మహాదేవ!" శబ్ద
ములను నిస్వనితం బయ్యె జ్వలిత మయ్యె
నామహాక్రతువహ్ని దీప్తార్చి యగుచు.

కల్పికిఁ గ్రోశదూరమునఁ గాంచనగంగ యటన్న చోటునన్
సల్పిరి యుద్ధ మాయుభయసైన్యము లిర్వదియేండ్ల చాన మా
ట ల్పచరించి డాలును, గటారియుఁ గై కొని ముందు దూఁకఁగా
నల్పపుగుండె పోయెఁ జము వంతట సింహవినాద మొప్పఁగన్.

క్రాంతగాఁ గాకపోయినఁ గొంతయైన
దర్పముం జూపఁగలదు స్వతంత్రసేన
కాని దూరాన బారులుగాఁగఁ దీర్చి
నిప్పులురలు ఫిరంగుల నిల్వలేరు.

విరిసిన ఘోరమందునను వెక్కసమైన ఫరంగిజాతివా
ర్వరుసను బెట్టి యిర్వదిఫిరంగుల నిప్పులు గ్రక్కుచుండఁగా
విరవిరఁ దచ్ఛతఘ్నిపదవీనుదవీక్షణ మాచరించుచున్
దిరముగ వానినోళ్ళు బిగఁదీయఁగ నెంచెను రాణి వ్రేల్మిడిన్.

తనుఁబడి వచ్చినట్టి సరదార్లను గైకొని వందమంది స్వ
ర్ధుని సురధాత్రినిర్గతయు ధూర్జటిమౌళిజటానిటాలమం
దునఁ బెనగొన్న పాయలుగ దూఁకినరీతి ఫిరంగినోళ్ళయం
దున విలయప్రపాతముగ దూఁకి “హరా! హర! నీలలోహితా!”

అనుచు ఫిరంగిపై నెగిరి యావెనుకన్ మరి ప్రక్కలందునన్
నినుచుచు మందుఁ దీవ్రముగ నిల్చినవారిని ప్రేల్చునట్టివా
రిని గరవాలపాతవిపరీతపు మృత్యుపథంబు జొన్పుచున్
గనుకని మృత్యుదేవతయుగాఁ బెనుఝంఝగ రేగియేగుచున్.

వదలక వెంట వెంటఁ బడి వచ్చి ఫిరంగులకంటె మంటలై
పదరుచు దూఁకి దూఁకి కరవాలమహానిశితోగ్రధారలం
గుదులుగఁ బట్టి కుత్తుకలు కోయుచుఁ జూచు ఫరంగిసేన తా
మెదురయి పోరలేక మొద లెల్ల వదావదలై చలింపఁగాన్.

పదిపదకొండుసారులుగ వచ్చెను విచ్చిన పీన్గుపెంటలై
గదనము లూఁడఁబీకిన ఫరంగులు ముంగల వెన్కఁ దెబ్బ తా
వదనములున్ హతంబయిన వాలములై వరుసన్ గ్రహించి యి
ర్వదియును జచ్చినట్టివి శవంబులుగాఁ గనిపించినంతటన్.

రంగులు మారిపోయెను ఫరంగులయాననముల్ స్వతంత్రసే
నాంగము చెల్లరేగి పరిహారము చేయఁగ నెచ్చటచ్చటన్
జెంగులు తూలి కించిదవశేషముగా నశియించినారు ఫా
రంగులు శిష్టనాశనధురంబుగ రాణియు వచ్చునంతలో.

కృతయుగధర్మ మొల్లు పయికిం జననిచ్చు స్వకాలమందు దు
ర్మతి కలి సర్వపాపపరిరంభణశీలుఁడు పైన నీశ్వరుం
డతులితకృష్ణపక్షశశిహాస్యునిఁ గాంచుచు ధైర్యమూని దోః
ప్లుతిగని లేచె నొంటెమెడవోలిక వక్రతఁదాల్చు శక్తియై.

ఉదితంబౌ పెనుభీతిచే నవనవై సంఖ్యాగోజనుల్ నూటయేఁ
బదియుఁ ష్ట్రింబుల సైన్యముల్ గదలిచెల్ బ్రహ్మపుత్రధై న్యాంబునల్
దుది నాలంబముగాఁగ గడ్డిపరకల్ దోకొన్న చందంబుగా
నదియుల్ నావగ మారుఁ గాల మనుకొంటాంగాగతం గాల్చిరల్.

ముంగలఁ బిక్కటి వెన్కలను మూఁగిన రొయింటులు తూఁగు పల్లకీ
బొంగులవోలె నెట్టుకుగుపోటుల కొగ్గక నూగుచుండఁగా
లొంగి స్వతంత్రసేన తుట్టిలోన ఫగంగులసేన శిక్షితం
బంగద నార్చి తూల్చెఁ బరిహాసముగాఁగ స్వతంత్రసైన్యముల్.

బంటుకాళ్ళకిందనుండి వచ్చి హారితు
రొంటుపైననుండి యురుకుచుండు
రొంటువంకరమెడనుండియు నెత్తురు
రాణిసేన తూపరాణి యయ్యె.

తూర్పు పడమర పడమర తూర్పు నయ్యె
నొకని మీషంబులోన నాయునికిఁ జూచి
తాంతియాటోపియును రాణి ధర్మభంగ
కాల మని వేఱుచోటికిఁ గదలినారు.

అదియే వీలగు శత్రుల
కదియే వీరికిని వీలు నరయ సుశిక్షా
పదమున నిల్వని సేనల
మొదలోని స్వతంత్రభావ మేమి పొనర్చున్

కల్పి స్వాధీన మయ్యెను గడకు నల ఫ
రంగిమూఁకకు వారి కౌరా! య దెంతో
చేతనైనట్టి హింసను జేసినారు
కల్పియందునఁ గాంచనగంగయందు.

---

# ఝాన్సీ రాణి

## నవమాశ్వాసము

మున్ను సింధియా పీష్వాలభూమి కొంత
యాక్రమణముం బొనర్చి రాజయ్యె నచట
గ్వాలియరులోనఁ గోటను గట్టి యాఫ
రంగులకు నుండె నెందును రక్షగాఁగ.

తాంతియాటోపి యట భారతస్వతంత్రి
తామహాభావసమితి వి త్తనము వేసె
నంకురించి నీ వది యెపు డన్న నపుడు
కొమ్మలన్ వేసి పుష్పఫలమ్ము లొప్పు.

ఇపుడు పీష్వాను గొని యట కేగినారు
తాంతియాటోపియును రాణి తత్ప్రజాళి
సింధియాఁ ద్రోసి రాజని చీరి చేర్చి
నారు పీష్వాను సింహాసనంబునందు.

కట్టుదిట్టంబులం జేసి గ్వాలియరున
సేన శిక్షించుచుండిన చిన్నవార్త
వినియె హ్యూరోజు సింధియా వెడలిపోయి
యయ్యె మరలఁ బాదాక్రాంతుఁ డైనయంత.

ఆయాడుపులి నిదుర పో
నీయదు నను మున్న మ్రింగెనే యనిపించెన్
మాయురె! యిచ్చట నేనో
యాయమ యో! చివరివిషయ మటఁ దేల్చవలెన్.

ఎడఁదలో శత్రుగుణముల నెంతొ మెచ్చుఁ
బైకి నొకమాట పలుకదు పాలసుండు
పైకి రాణిని మెచ్చిన స్వజనమందు
గౌరవమునకు లోపంబు, కాదు నీతి.

మరల నాయొంటెలే తనమానరక్ష
సేయు నని వానిఁ గొంచేఁగ ఛిద్రబుద్ధి
మెడలు కాళ్ళును నడుము పట్టెడలు కోసి
నగయఁజేయుట యొంటెల నేర్పె రాణి.

గ్వాలియరుకోటలో శాత్రవాలి వచ్చి
నన్ సుసాధంబ యగు దక్షిణంపు బురుజు
నాబురుజుమీఁద రాణి బద్ధాసి యగుచుఁ
గూరుచున్నది పులివోలెఁ గ్రోల్చికొంచు.

బురు జని పేరెగాని యట మూఁకలు మూఁకలు కూడి యుద్ధమున్
జరుపుటయే ఫరంగులు నెసంగిరి యొంటెలసేనతో బడిన్
నరికిరి రాణిసేన గళనాళములున్ మెడపట్టెడల్ చలా
ధరములు పారఁగా నడుముపట్టెడ లొంటెలు కుంటుపోవఁగా.

తక్కినచోటులందు భరతక్షితిజాతుల సేన యుంచి రా
యొక్కడనే ఫరంగులు మహోగ్రమహోరుత్తతరంగఘాతు లా
చక్కని ముందు వచ్చుచును సాఁగుచు వెన్కకుఁ బోర రాణికిం
జిక్కినవాఁ డహో యమునిచేరిక కన్నటునంటివాఁడుగా.

అది పదివాళ్ళు లైనయది యాహవ మందు ఫరంగిగొంతు సా
చదృషదధఃకఠోరము కసాయిదుకాణముగా, ఫరంగులే
కదనమునందు ముందుఁ జని కయ్యము సేయరు దానఁ జావ కీ
కదనమునందు రాణి తుదికత్తికిఁ జావక తప్పదయ్యెడిన్.

సేనానాయకుఁడంచు ముందునకు వచ్చెన్ నాఁగ లే దెప్పుడున్
సేనాపృష్ఠమునన్ మనున్ రణకళాచ్ఛిద్రంబు కాకుండఁగన్
హూణవ్రాతము యుద్ధనీతి యిది యా హ్యూరోజు తా వచ్చెనన్
రాణిం దాఁకిన నప్పు డాఁ[illegible]గృహితయుగారంభంబు ముమ్మాటికిన్.

దినములు పోయినకొలఁదిన్
దనసేనయుఁ దరుగుచుండె దండులుగాఁగన్
జనుదెంతు రీఫరంగులు
తనకత్తిని జావు వాంఛితం బనినట్టుల్.

కోట మిగిలినయెడ ఫరంగుల ఫిరంగి
గుండ్లకుం బీటు లిచ్చి దిక్కులం జలించె
లోని సైన్యంబు, యత్నము లూన మయ్యె
రాణి యొక్కర్తుకయు నేమి తాను జేయు?

ఆభద్రకాళిజిహ్వా
క్షోభం గని యెంతమంది జుణిగిరో! విచల
ల్లోభాకృతులు ఫరంగులు
హ్రీభయముల దల్లడిల్లి రెల్ల ఫరంగుల్.

ఇంక లాభంబును లే దటన్న దినమం దెచ్చోటికో రాణి సై
న్యకముం దూసుక వెంట మందరయు రా నశ్వంబుపైఁ బోవఁగా
నకటా వెన్కను జచ్చినా ననిన కేకై రాణి యామందరా
సుకముల్ తీయు ఫరంగిగొంతు నరకెన్ శూరత్వవిక్రీడగా.

తనబాల్యమిత్ర మాయమ
తనకన్నులయెదుటఁ జచ్చి ధరణిం బడఁగా
ననటం గని రాణియు నో
క్కనిమేషము దుఃఖమె మృతి కావుట గాఁగన్.

వాటుగ నాయమ నేమటు
పాటునఁ జంపవలెఁగాని పట్ట వితసముల్
వాటుగ నాయమ యేమటు
పాటు దొరకె నొకఫరంగిపాదలి కచటన్.

రాజకీయంబులందున రణములందు
మ్లేచ్ఛనీతిగొ మరి విడంబించుచుండు
ద్వాపరాంతంబునందునఁ దా మొదలిడి
కలియు నధికంబుగా నధికంబు నగుచు.

పరమమాహేశ్వరమహాఃప్రపాలితాత్మ
ధునియునై దుష్టకాలరోధోనియమిత
"నావసుధ వందయేండ్లు నిండవు ఫరంగి"
కనుచు శపియించి రాణియుఁ గనులు మూసె.

దప్పిక కలవారి రొప్పించి యెండమా
వులదాఁక నీడ్చి తావులను నెఱపు
చూపుమేఱన నీళ్ళు చూపి చేర్పకయ యెం
డిననాల్క పిడచకట్టించి నిలుచు
సాయ మయ్యో నటంచు శైత్యోపచారంబు
లెడలించి వడగొట్టి యిడియఁబెట్టు
అమృతాంశుఁ డరుదెంచె నని మింట నెఱపి యా
వెన్నెలపోరల నావిరులు పెట్టు
అధమపరివంచనాప్రథమావతార
మూర్తి గ్రీష్ముండు చనుదెంచె మొదట జనుల
నిస్సహాయులఁ జేసి మండించి మండి
పిదపఁ బడమటిగాలితోఁ బిచ్చలించి.



# ఝాన్సీ రాణి.











విశ్వనాథ సత్యనారాయణ